




కుటుంబ సమేతంగా
తప్పక చూడండి!
అరుణా ఫిలిమ్స్ వారి
సోమవార వ్రత మహాత్మ్యం
డైరెక్టర్
R.M. కృష్ణస్వామి
సంగీతం
వేణు

# ఉత్తరాలు

## చదువుల్రావు

"చదువుల్రావు" లో ఒక సహజత్వం ఉంది. అదేమిటంటే—ఆ పనిమనిషి, తెలుగు సినిమాలో హీరోయిన్, పనిమనిషి వేషంలో ఉన్నట్లో, లేక పోతే, చదువుల్రావుగారి స్నేహితురాలు జయశ్రీ "సోషల్ సర్వీసు" చేయడానికి వచ్చిందో అన్నట్లుగా ఉంది. చేతిలో చీపురుకట్ట ఉంది గనుక పనిమనిషి అనుకోవాలేమో ?

ఆనందమోహన్ కె. (విజయనగరం)

## కథలు

"పాపం చదుకొన్న అబ్బాయి" అనే కథ చదివిం తరువాత మీరు అమ్మాయిల (ఆడవారి) వ్రాతలను 'వనితావాణి' లో వ్యాసాల రూపంలోనే కాకుండా అప్పుడప్పుడు 'కథల' రూపంలో కూడా ప్రచురిస్తారన్న సంగతి తెలిసింది.

వై. శేషారావు (వాల్తేరు)

## కార్టూన్

4—1—1963 పత్రికలోని 41 వ పేజీలో ఉన్న కార్టూను అర్థం లేకుండా ఉన్నది. ఆ కార్టూనులో మూడవ గడిలో సన్నగానున్న మనిషి బెలూనుతోనే పైకి తేలిపోయాడు. కాని ఆ మనిషే రెండవ గడిలో ఆ బెలూనునే పట్టుకుని నిలబడ్డాడు. అప్పుడు అతను గాలిలో తేలిపోలేదు. కాని, తరువాత (మూడవ గడిలో) తేలిపోయాడు. ఇది అసందర్భము.

నరసింగరావు అండ్ రాఘవ (జాలాపుట్)

## న్యూఢిల్లీ లేఖ

"ఆఫ్రో ఏషియా రాజ్యాలలో భారతదేశానికి మిత్రరాజ్యమంటూ లేకుండా ఏకాకై పోయింది." అని 18—1—63 న్యూఢిల్లీ లేఖ మొదటిపేరాలో వున్న వాక్యం కేవలం నిరాధారమైనది. సిరిమావో, అలీసబ్రీ, ఫోరీఅట్టా ప్రభృతులు మనదేశానికి ఎందుకు వచ్చారో శ్రీ కృష్ణగారికి తెలియదు అనుకోవాలా ?

రాజీనామా ఇచ్చిన కృష్ణమీనన్‌ను విమర్శించడం, మంత్రుల ఉపన్యాసాలను శుష్కప్రసంగాలనడం, పాశ్చాత్యదేశాలు దయదల్చి ఆయుధ సామగ్రి సరఫరా చేశాయనడం మొదలైన విషయాలవలన ఏ విధమైన ప్రయోజనం ఉండదు సరికదా, రాసినవారిపై గౌరవంతగ్గే అవకాశం ఉంది కూడాను.

ఎన్. రామకృష్ణారావు (కాకినాడ)

* * *

జనవరి 18 సంచికలో శ్రీ కృష్ణగారు "ప్రపంచంలోని తటస్థరాజ్యాలనే తృతీయశక్తికి భారతదేశం నాయకురాలనే భ్రమతెరలు విడినట్లు రూపుమాసిపోయింది" అని వ్రాసిన మాటలు చదువుతుంటే, కడుపులో దేవినట్లు బాధకలిగింది. విధివైపరీత్యం కాకపోతే, చివరికి సింహళంవంటి రాజ్యాలచేతకూడా మనకు శాంతి పాఠాలా ? ? !

సత్యప్రియ (హైదరాబాదు) ★

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 22—2—63
శుభకృన్నామ సం॥ మాఘ మాసం॥ బ॥ త్రయోదశి
సంపుటము : 55 సంచిక : 25

*

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా. రూ. 13.00 ఇతర దేశాలు. ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13.0.0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1





# మనలో మాట

ఎన్నాళ్లనుంచో ప్రారంభిస్తామని చెప్తూ వచ్చిన 'తెరమీద–తెరవెనుక' శీర్షికి మొదటివ్యాసం ఈ వారం వేస్తున్నాము. తెలుగు సినిమా పరిశ్రమలో ప్రఖ్యాతి, ప్రాచుర్యం గల వ్యక్తులు కొందరితో ఇంటర్వ్యూలు జరిపి, వారి ప్రత్యేకాభిప్రాయాలు, కొన్ని సేకరించి వ్యాసరూపంలో పాఠకులకు అందచేయటమే మా ముఖ్యోద్దేశం. తెలుగుసినిమా ప్రపంచంలో ప్రముఖులయిన వారందరినీ ఈ విషయమై సంప్రదించాము. చిత్రపరిశ్రమలోని వారికి తీరిక తక్కువే, అయినప్పటికీ చాలామంది వెంటనే మా ప్రతినిధి శ్రీ వీరాజీకి ఇంటర్వ్యూలు ఏర్పాటు చేశారు. మొట్టమొదటి ఇంటర్వ్యూ శ్రీ అక్కినేని నాగేశ్వరరావుతో జరిగింది. ఈ ఇంటర్వ్యూ పూర్తి కావడానికి ఆరుగంటలు పట్టింది! రాజా అన్నామలైపురంలో వీరి ఇంటికి శ్రీ వీరాజీ రెండురోజులు, రెండుసార్లు వెళ్ళవలసివచ్చింది!

[ఈ వ్యాసం కూడా రెండు భాగాలుగా విభజించవలసి వచ్చింది!]

ఈ శీర్షిక పాఠకులకు నచ్చుతుందని ఆశిస్తాము.

28వ పేజీలోని బొమ్మ శ్రీ 'రూప' తీసినది.

* * *

కొత్త శీర్షిక వేసినందువల్ల బొంబాయి సినిమా తార కుమారి సాధనా శివదాసాని వ్యాసం పై వారానికి వాయిదా వేశాము.

* * *

సినిమా పోటీ గడువు తేదీ సమీపిస్తోంది సాధారణంగా 'పోటీ రచనలు' గడువు తేదీ అయిపోతూందనగా ఎక్కువగా వస్తాయి! ఈ పోటీకి కూడా వ్యాసాలు అధికంగానే వస్తాయని ఆశిస్తున్నాము.....

## లోకంపోకడ



"అయ్యా! అయ్యగారు 'బిజీ' అను తున్నారుగాని రక్షణనిధి వసూళ్లకు వెళ్లేరని వచ్చినవాళ్లతో చెప్పమన్నారండీ!"

# విషయానుక్రమణిక



రోగ క్రిములను అంటనీయకండి—
గాయమును త్వరగా
మానేలా చేయండి

# బ్యాండ్-ఎయిడ్

## ప్రథమ చికిత్స పట్టీలను వాడండి!

బ్యాండ్-ఎయిడ్ ప్రథమ చికిత్స పట్టీలు

- చిన్న కోతలను, గాయములను మరియు దెబ్బలను మూసి ఉంచును
- గాయములను నీరు పట్టకుండా మరియు పరిశుభ్రముగా ఉండేలా ఉంచును
- గాయమును త్వరగా మానేలా చేయును
- చర్మమునకు గాలిని తగలనీయును
- ఒక్కొక్కటి విడివిడిగా ప్యాకు చేయబడినవి...తీసుకొని పోవుట సులభము ... ఉపయోగించుట తేలిక



బ్యాండ్-ఎయిడ్ ప్రథమ చికిత్స పట్టీలను
ఎల్లప్పుడూ సిద్ధముగా ఉంచుకోండి!




JWT-JJ-4743

జాన్సన్ & జాన్సన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్

# పొంతన లేని కేంద్ర మంత్రి మండలి

ప్రజ్ఞ

ఈ వారం అంటే జనవరి చివరివారం ఒక విధంగా చీకటి వెలుగులు లాస్యం చేసే రోజులు అని చెప్పవచ్చు. భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలంటూ కాంగ్రెస్ లాహోరులో తీర్మానించిన రోజు జనవరి 26 వ తేదీ. 1950 లో భారత దేశాన్ని రిపబ్లిక్‌గా ప్రకటించిన రోజు కూడా జనవరి ఇరవయ్యారే.

ఈ ఏడాది రిపబ్లిక్ ఉత్సవాలు చాలా మందకొడిగా జరిగాయి. మన ప్రధానమంత్రి ప్రపంచ జనాభిప్రాయంలో మంచి నమ్మకంగల వ్యక్తి. అయితే ప్రపంచంలో ఏ దేశపు ప్రధానమంత్రి కూడా ఇలా రిపబ్లిక్ దినోత్సవంలో కొంతమంది సభ్యులతో కలిసి విన్యాసంలో పాల్గొనరు. పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి జాతీయ పతాకం చేతిలో పట్టుకొని, ఆయన వెనక పార్లమెంటు సభ్యులు సైనిక విన్యాసాల్లో పాల్గొని రాష్ట్రపతికి గౌరవాభినందనలు చేస్తుంటే ప్రపంచమంతా వేడుకతో చూచింది. పోనీ, ఈ పార్లమెంటు సభ్యుల విన్యాసం" రోడ్డు చివరదాకానన్నా జరిగినా అదో రకంగా ఉండేది. వేదికా ప్రాంతాన్ని దాటగానే ఈ సభ్యులంతా పరుగెత్తుకుపోయి, ఎవరిస్థానాల్లో వాళ్ళు కూచున్నారు! సినిమా తారలు విన్యాసాల్లో పాల్గొనటం ఈ ఏడాది రిపబ్లిక్ విశేషాల్లో ఒకటి.

* * *

ఇప్పుడిప్పుడే వేసవికాలం నెమ్మది నెమ్మదిగా చొరబడుతున్నది. పగటి పూట వేడి ఎక్కువగా ఉంది. రాత్రులు కూడా వెనకటంత చల్లగా ఉంటంలేదు. నిజానికి న్యూఢిల్లీ ఇప్పుడు కాస్త హాయనిపిస్తున్నది. నైసర్గిక వాతావరణం ఎంత హాయిగా కన్పించినా, అందరికీ ఓ మూల బిక్కు బిక్కు మంటూనే ఉన్నది. చైనా విషయం అందరినీ వేధిస్తూనే ఉంది.

కొలంబోలో సమావేశమైన ఆరు తటస్థ రాజ్యాల వివరణలకు సవరణలకు లోబడి కొలంబో ప్రతిపాదనను భారతదేశం ఆమోదించింది. చైనా ఈ ప్రతిపాదనకు తన వ్యాఖ్యానం తాను చేసుకుంది. కొలంబో ప్రతిపాదనను యధాతధంగా ఆమోదించటం జరిగిన తరువాతనే భారత చైనాల మధ్య అధికారహోదాలో సంప్రదింపులు జరపాలని భారతదేశం అంటున్నది. అందుకు చైనా, తమ తమ వ్యాఖ్యానాలు ఆధారంగానే సంప్రదింపులు జరపవచ్చున్న పద్ధతి ననుసరిస్తున్నది.

రెండు ముఖ్యమైన విషయాలను మన దేశం మర్చిపోతున్నది. ఈ కొలంబో రాజ్యాలకు వాటికున్న శక్తి, సంప్రదింపులకు ప్రోత్సహించే శక్తి మాత్రమే. పైగా ఈ తటస్థ రాజ్యాలు ఏర్పరచిన ఆటబొమ్మ లాంటి ప్రతిపాదనలవల్ల ప్రపంచాభిప్రాయమేమీ మారలేదు. ప్రపంచాభిప్రాయం కమ్యూనిస్టు రాజ్యాలపైన ఎటువంటి ప్రభావాన్నీ చూపలేదు.

ఇక రెండవ విషయం: మొదటి దఫా దాడిలో భారతదేశం చిత్తుగా ఓడిపోయి, సైనికంగా బలపరచుకునేందుకు తగిన వ్యవధికోసం ప్రయత్నాలు చేస్తున్నదని చైనాకు బాగా తెలుసు. అసలు చైనా మీద కృశ్చేవ్ కోపానికి ముఖ్య కారణ మేమిటంటే చైనా తన దండయాత్ర మూలంగా పాశ్చాత్యులను, భారతదేశాన్ని సన్నిహితులుగా చేసిందే అని !

సరే. అయిందేదో అయింది ! ప్రధాని శ్రీ నెహ్రూ మాత్రం ఏం చేయగలరు ? ఆయన సిద్ధాంతాలే ఆయన్ని ముంచేశాయి. ప్రపంచంలో అన్ని రాజ్యాలు బలంగానే ఉన్నాయనీ, ఈ బలం దురాక్రమణను నిరోధించగలదన్న నమ్మకంపైనే ఆయన సిద్ధాంతం ఉంది. అయితే న్యూగినీ విషయంలో ఇండొనీషియా, హాలెండ్‌ల మధ్య ఏర్పడ్డ సైనిక సంఘర్షణ కానీ, ఇండొనీషియాకు బ్రిటన్‌తో బ్రూనీ సమస్యపైన ఏర్పడ్డ సైనిక సంఘర్షణలు కానీ, ఈ కోవకు రావు. వాటికి వేరే పేరుంది. పాశ్చాత్య వలసతత్వాన్ని నిరోధించే చర్యలు అవి. ఇన్నాళ్ళ ఈ ఊహాలోకంలోనే కాంగ్రెస్ పక్షం జోల పాడుకుంటూ నిద్రిస్తున్నది.

అయితే చైనా ఒక విషయం మాత్రం చాలా తప్పుగా ఆలోచించింది. పాశ్చాత్యులను ప్రధాని శ్రీ నెహ్రూ తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టటం చూచి బ్రిటన్, అమెరికాలు భారతదేశానికి ఎలాంటి సాయం చెయ్యవని అనుకుంది. ఏదో లాంఛనప్రాయంగా మిగ్‌ల రూపంలో (దీన్నే ప్రధాని శ్రీ నెహ్రూ వాణిజ్య సహాయం అన్నారు) గత నెలలోనే ఓడలో రావాల్సిన సహాయం మాదిరి కాకుండా అమెరికా, బ్రిటన్‌లు తమ సహాయాన్ని విమానాల్లో భారతదేశానికి అందజేశాయి. చైనా యుద్ధవిరమణ చేసిందీ అంటే అందుకు ముఖ్య కారణం : సోవియెట్ సహాయం లేకుండా, భారత దేశంపైన తను ఇంకా యుద్ధం కొనసాగిస్తే పాశ్చాత్య దేశాలు భారతదేశానికి ఇంకా సన్నిహిత మౌతాయనే భయమే !

ఈనాటి పరిస్థితి చాలా అసందిగ్ధంగా ఉంది. కొలంబో రాజ్యాల వివరణల మేరకు భారతదేశం ప్రతిపాదనలను పూర్తిగా ఆమోదించింది. చైనా తనకు నచ్చిన వివరణ, సవరణలతో వ్యాఖ్యానాలు చేస్తున్నది. చైనా యధాతధంగా ఆమోదిస్తేనే కాని, ఆమోదించినట్లు కాదని భారతదేశం అంటున్నది. ఇదీ పరిస్థితి. ఈ విషయాన్ని ప్రభుత్వం పార్లమెంటు ముందుంచింది. అయితే యిక్కడొక టుంది. పార్లమెంటు ఇదివరకున్నంత ఏకగ్రీవ వ్యవస్థగా ఇకముందుండదు. రెండు దుష్ట శక్తులు పార్లమెంటును బలహీనపరచాయి. అందులో మొదటిది : రాజకీయ నాయకులు ఈ విషయాన్ని పార్లమెంటు ముందుకు రాకపూర్వమే నిర్ణయించటం; సభ్యులు పార్టీ తంత్రాంగానికి బానిసలు కావటం; అనుకూల వ్యతిరేకతలను సభలో ప్రకటించుకొనే అవకాశాలు లేకపోవటం. పార్లమెంటును బలహీనపరచే రెండవ కారణం: పార్లమెంటు సభ్యుల సంఖ్య, ప్రభుత్వ విధానాల్లోని క్లిష్టత. వాగ్వివాదం నేర్చుకునే యువకుల క్లబ్‌లకన్న ఎక్కువ లేనిది ఈ సభ. అన్నిటితోపాటు మన దేశపు ఖర్చుతో సగాన్ని అదుపుచేసే యంత్రాంగంపై చర్చ ఈ సభ పాలిట పడింది.

దేన్నయినా, ఒక పద్ధతిలో జాప్యంచేసి నిస్సారం చేసే విద్య ప్రతి పార్లమెంటులోను ప్రభుత్వ పక్షాని కుంటుంది. "మీ రిది ఉన్న పళంగా ఆమోదించాలని చెప్పటంలేదు. 'ఈ విషయాన్ని చర్చిద్దాం' అంటే చాలు." అని సభకు చెప్పి, కొంతకాలం తర్వాత ప్రభుత్వం "ఈ సమస్య మేం మొదట అనుకున్న దానికన్న విరుద్ధమైన పంథాల్లో ఉంది. ఇది చాలా క్లిష్ట సమస్య." ఇంతటితో ఆగక ఇంకా ముందుకూ్కడా పోతుంది ప్రభుత్వం.

ఈ నెల్లో ఇదే జరగబోతున్నది. సెప్టెంబరు 8 వ తేదీ స్థావరాలకు పిసమంతైనా తగ్గేది లేదనీ, ఆ స్థావరాలకు చైనీయులు వెళ్ళిపోవాలనీ మన మొదటి వాదం. వివరణలు, వ్యాఖ్యానాలతో కొలంబో ప్రతిపాదనలు 'సెప్టెంబరు 8' వాదానికన్నా, మెరుగ్గా ఉన్నాయని తెలుసుకున్నాం. ఇంకా కొంతకాలానికి ఆ చైనావాళ్ళ వ్యాఖ్యానాల ప్రతిపాదనలే కొలంబో ప్రతిపాదనలకన్న మరికొంత మెరుగ్గా ఉంటాయి.

ఇవన్నీ ఇలా ఉంచుదాం. భారత సైనిక శక్తి సమీకరణలో మన ప్రభుత్వం ఏమి చేస్తున్నది? అన్నదాని మీదనే భారతదేశ భద్రత ఆధారపడి ఉంది. చైనీయుల యుద్ధవిరమణ ఒక విధమైన ఫిర్యాదు స్వభావాన్ని కలిగించింది. దేశంలో ప్రజా చైతన్యం తలెత్తే అవసరం రాకుండానే తిరుగుముఖం పడుతున్నదన్న విషయం ప్రభుత్వానికీ తెలుసు. ఇలా జరగటం నిజంగా విచారించతగ్గ విషయం. ఇప్పటిమాదిరిగా గాక, ఇదివరలో కేంద్ర మంత్రివర్గంలో అభిప్రాయభేదాలు చాలా అరుదుగా ఉండేవి. విద్యుత్, నీటి వనరుల వార్షిక సమావేశంలో ప్రసంగిస్తూ ఆర్థిక, రక్షణ సహకార శాఖ మంత్రి కొన్ని సత్యాలను బైటపెట్టారు. ఆ తరువాత రేడియో ప్రసంగంలో శ్రీ గుల్జారీలాల్‌నందా, దేశం అంతా పకడ్బందీగా ఉన్నదని అనటం జరిగింది.

మన దేశంలో విదేశీ పెట్టుబడుల అభివృద్ధికి వాతావరణం కల్పించేందుకు ఆర్థికమంత్రి శాయశక్తులా ప్రయత్నిస్తుంటే, ఆయన సహచరులు ఉక్కు, నూనె శాఖల మంత్రులు, భారత సంపదను ఈ పెట్టుబడులు ఖాళీచేస్తాయని విదేశీ పెట్టుబడి సంస్థలను, సహకార సంస్థలను దుయ్యబడుతున్నారు.

ఈ అత్యవసర స్థితిలో మన ప్రణాళికల మంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా అభిప్రాయాన్ని ఆయన ప్రసంగంలోని ఈ క్రింది మాటలు వ్యక్తం చేస్తాయి:

"మూడవ పంచవర్ష ప్రణాళికలో అనుకున్న

55 [illegible] చూడండి



# శ్రీదేవి

### జరిగిన కథ

దుర్గాప్రసాద్, విశ్వేశ్వరరావు కుమారుడు; భార్య అనసూయమ్మను హింసిస్తూ ఉంటాడు. దుర్గాప్రసాద్ కుమార్తె శ్రీదేవి జగన్నాథం వద్ద సంగీతం నేర్చుకుంటూ ఉంటుంది. సంపన్న కుటుంబీకుడే అయినా దుర్గాప్రసాద్ పిల్లలను, భార్యను ఉపేక్షించి, త్రాగుడూ, స్త్రీలోలత్వం అలవడతాడు. ఒకనాడు అనసూయమ్మను పొడిచి గాయంచేసి వెళ్ళిపోతాడు. గాయం మానాక, విశ్వేశ్వరావుగారి విధవప్ప చెల్లెలు సుభద్రమ్మ అనే ఆమెను శ్రీదేవికి అత్తయ్య అని పరిచయం చేసింది. అక్కడ శ్రీదేవికి ఆమె మరిది వేణుతో పరిచయమై, అతనంటే ఆకర్షణ ఏర్పడుతుంది. శ్రీదేవికి, శ్యామల, సావిత్రి అనేవారు ఆత్మీయులౌతారు. కాలేజీ విద్యార్థిని నళిని వేణుని ప్రేమిస్తుంది. వేణూ శ్రీదేవులు, పారిపోయి వివాహం చేసుకుంటారు. మోజుతీరిన వేణు శ్రీదేవిని నిరాదరిస్తాడు. సావిత్రి శ్రీదేవి నోదారుస్తుంది. శ్రీదేవి పుట్టింటినుండి డబ్బు తేప్పించలేదనే కోపంతో వేణు ఇల్లు వదలి పోతాడు

(గత సంచిక తరువాయి)

వచ్చాడు ప్రొద్దున్న శ్రీదేవి మనస్సు చాలా తేలికగాఉంది. ఆమెలో ఏదో ఒక కొత్త ధైర్యం కలిగింది. ఈరెండు రోజులలోనూ ఆమెకు భవిష్యత్తు గురించి చాలా భయంగా ఉండేది. అంతేకాక, వేణు ఆమెని వదిలి వెళ్లటానికి లోకం తనదే లోపమని అంటుందేమోననీ, అందరూ తనను విమర్శించి తనపై లేనిపోని అబాండాలు వేసారేమోననీ ఆమెకు చాలా బాధగా ఉండేది. కాని ఆమెకు సావిత్రి సానుభూతి, మాటలూ చాలా ఉపకరించాయి. మనం దేనిగురించైనా భయపడుతున్నప్పుడు దానిని యింకా భయంకరంగా ఊహించుకొని, దాని శక్తిముందు మనం నిలవలేము అని అధైర్యపడతాం. కాని ఏ కారణాలవల్లనైనా మనలో విశ్వాసం లభించి, మనం భయపడేదానిలో చాలా లోపాలు కన్పిస్తే, మన కా భయం పోతుంది. మనం దాన్ని అధిగమించినట్లూ, సంఘంకన్నా ఒక మెట్టు పైకి వెళ్లినట్లూ అనుభూతి పొందుతాం. అప్పుడు మనలో చాలాధైర్యం కలుగుతుంది. మన నెత్తిమీద ఉన్న భయమల్లా మన కాళ్లక్రిందకు వచ్చేస్తుంది. అంతవరకూ మనం తెగించి ఏ పనీ చెయ్యలేం. ఆ భయం పోయినతరువాత మాత్రం, మనం ఏదో ఒక పని చెయ్యగలుగుతాం. శ్రీదేవికి, వేణుప్రవర్తనవల్ల ముందు మానసిక బలహీనతా, భవిష్యత్తును గురించి భయం, తనవల్ల లోపమేమైనా ఉందేమోననే బాధా, అతను వెళ్లిన రెండురోజులదాకా, ఏ పనీ చెయ్యనివ్వడం కాని, ఏ ఆలోచనా తోచనివ్వడంకాని, చేశాయికాదు. కాని యిప్పుడామెకు ఆ మనస్తత్వం పోయి, తన తప్పు ఏమీలేదనే ధైర్యం ఏర్పడింది. ఇకముందు తాను చెయ్యవలసిన కార్యక్రమంకూడా ఆలోచించ దల్చుకుంది.

కాఫీ త్రాగుతూ సావిత్రి, శ్రీదేవిలోని ఈ మార్పు గమనించింది. అందుకు ఆమె చాలా సంతోషించింది. వేణుమీద శ్రీదేవి మనస్సు విరిగిపోయిందని సావిత్రి గ్రహించింది. అది పాలపొంగులాగ పొంగింది, ప్రాపంచికానుభవంతో చల్లబడిపోయింది. ప్రేమ, ఇదరి వ్యక్తులమధ్య శాశ్వతంగా నిలవాలంటే ఎన్నో అనుకూల పరిస్థితులు కావాలి. ముఖ్యంగా ఇద్దరి వ్యక్తులలోనూ నిజాయితీ కావాలి. వేణు వట్టి మోసగాడు. శ్రీదేవి కతనికియందు నమ్మకం పోయింది.

తను కాలేజీకి వెళ్లివస్తానని, ఈ లోపల "చరిత్రహీన్" పూర్తిచెయ్యమని శ్రీదేవికి చెప్పి, సావిత్రి రోడ్డుమీదకు అడుగుపెట్టబోయింది. ఆమెకు, ఎదురుగా వస్తున్న నల్లటి ఫోర్డుకారు కన్పించింది. సావిత్రి ఒక నిముషం ఆగింది. ఇంటి గుమ్మంవద్ద నిల్చున్న శ్రీదేవికూడా, ఆ కారుని ఆశ్చర్యంగా చూడసాగింది. ఆ కారు సరాసరి తమ యింటివద్దే ఆగింది.

కారులోంచి దిగిన దుర్గాప్రసాద్, సావిత్రిని చూచి, "నువ్వు శ్రీదేవి స్నేహితురాలివికదూ ?" అని అడిగాడు. ఆమె అవునంది. అతను, సావిత్రిని శ్రీదేవి ఇల్లు చూపించమని అడిగాడు. సావిత్రి ఆయనను తీసుకొని శ్రీదేవివద్దకు వచ్చింది. తండ్రిని చూడగానే భయం, ఆశ్చర్యం, దుఃఖం ఒక్కసారి శ్రీదేవి హృదయంలో ప్రవేశించాయి. తన నేమంటాడో అని చాలా భయంవేసింది. ఏ విషయంలోనూ కలుగజేసుకోని తండ్రి ఇలా తనవద్దకు రావటం ఆమెకాశ్చర్యం కలిగించింది. తను చేసిన పనికి ఆయనెంత నొచ్చుకున్నాడో అని దుఃఖం కలిగింది.

లోపలికి వచ్చిన దుర్గాప్రసాద్‌ను సావిత్రి కుర్చీలో కూచోమంది. శ్రీదేవి ఎదురుగా నిల్చొని, ఎందుకో తెలియకుండా ఏడ్చేస్తోంది. దుర్గాప్రసాద్ కొద్దిసేపు చూశాడు. చిక్కిపోయి, నల్లగా అయిపోయింది. కడుపు ఎత్తుగా కన్పిస్తోంది.

"నీ అమ్మ నిన్ను తీసుకురమ్మంది. పద, వెళ్దాం!" అన్నాడు దుర్గాప్రసాద్. తనని ఇంటికి రమ్మని పిలవడానికి తండ్రి వచ్చాడు. ఆయన మితభాషి. ఆ కొద్ది మాటల్లోనే ఎంతో భావం చూపించాడాయన. తాను శ్రీదేవినెంతో ప్రేమిస్తున్నట్లూ తను కామెయెడల ఏ మాత్రం కోపంలేనట్లూ ఆయన మాటలు వ్యక్తంచేశాయి. కళ్ళు తుడుచుకుంటూ, "అలాగే" నంది శ్రీదేవి.

కొన్నికొన్ని పనులు మనం అనుకోకుండా అకస్మాత్తుగా జరిగిపోతాయి. తను ఏంచేస్తోందోకూడా తనకు పూర్తిగా తెలియకుండా, ఆ యింటిని అలాగే వదిలేసి, కట్టుబట్టలతో శ్రీదేవి వెళ్ళి కారులో

కూచుంది; సావిత్రికూడా ఆమె ప్రక్కనే కూచుంది దుర్గాప్రసాద్ డ్రైవ్‌చేశాడు.

దుర్గాప్రసాద్ శ్రీదేవిని తను యింటికి తీసుకు వస్తాడని, విశ్వేశ్వరరావుగారింట్లో ఎవరూ ఊహించ లేదు అవాళ ప్రొద్దున ఏదో పనిమీద, దుర్గాప్రసాద్ తండ్రివద్దకు వెళ్ళాడు. అప్పుడాయన శ్రీదేవిని, వేణు విడిచివెళ్ళిన సంగతి చెప్పాడు అది విని దుర్గాప్రసాద్, శ్రీదేవి ఒక్కర్తీ ఎలా ఉండగలదని అడిగాడు. ముసలాయన కోపంతో, తన కా విషయం అక్కర్లేదనీ, వివరాలు అనసూయమ్మకు తెలుసుంటుందనీ అన్నాడు దుర్గాప్రసాద్ భార్యవద్దకు వెళ్ళి ఈ విషయమడిగాడు ఆమె ఏడుస్తూ తన కూతుర్ని తనవద్దకు దిగబెట్టమనీ, ఒకర్తీ అక్కడామె బాధపడుతూంటే చూడలేననీ, తానామాట అంటే, ఆయమ్మగాని విశ్వేశ్వరరావుగారు గాని ఒప్పుకోటంలేదనీ, చెప్పింది. వెంటనే, తను వెళ్ళి శ్రీదేవిని తీసుకువస్తానని దుర్గాప్రసాద్ బయల్దేరాడు. విశ్వేశ్వరరావుగారి ఇంటివద్ద కారాగగానే అందు మండి, శ్రీదేవీ, సావిత్రీ, దుర్గాప్రసాద్ దిగారు.

హాలులో ముగ్గురూ ప్రవేశించారు. కుర్చీమీద కూర్చుని ఏవో కాగితాలు చూసుకుంటున్న విశ్వేశ్వరరావుగారు తలెత్తిచూశారు. శ్రీదేవి కన్పించింది. ఆయన కాశ్చర్యం వేసింది. ఆమె తలవంచుకొని సావిత్రితోబాటు లోపలికి వెళ్ళిపోయింది దుర్గాప్రసాద్ తండ్రివద్దకు వచ్చాడు. శ్రీదేవి గురించి తండ్రితో మాట్లాడాడు వేణుగురించి వివరాలు తెలుసుకొని వాడితో శ్రీదేవికి తెగ తెంపులు చేసెయ్య దల్చుకున్నానన్నాడు. ఆయన కొన్నాళ్ళ వేణు ప్రవర్తన కనిపెట్టమన్నారు దంపతు లిద్దరి మధ్యా ఈ వివాదా లెందుకు వచ్చాయో కనిపెట్టాలన్నారు. ఇవన్నీ సంతృప్తికరంగా లేకపోతే విడాకులకు ప్రయత్నిద్దామన్నారు. కాని, 'హిందూ'లాలో విడాకులు ఎంతో కష్టమన్నారు ఏమైనా సరే శ్రీదేవి భవిష్యత్తు దెబ్బతినడానికి వీల్లేదని దుర్గాప్రసాద్ అన్నాడు కొడుకు ఈ విషయంలోనైనా ఆమాత్రం శ్రద్ధ వహించినందుకు విశ్వేశ్వరరావుగారు లోలోపల సంతోషించారు.

శ్రీదేవినిగూర్చి బాధపడ్డ వ్యక్తి అనసూయమ్మగారు అందువలన ఆమెకు కూతురు తిరిగి ఇంటికి రావడం చాలావరకు ఆనందకారణమైంది తన గదిలోకి రాగానే శ్రీదేవిని తన చేతుల్లోకి తీసుకొని ఏడ్చేసింది. శ్రీదేవి కూడా ఏడ్చింది సావిత్రి వారినిద్దరినీ వూరడించింది. తల్లీ కూతుళ్ళిద్దరికీ ఆ సమయంలో కేవలం రక్తసంబంధమేకాక, మరొక అనుబంధం కూడా తోచింది అది వారి జీవితాలలో సారూప్యత! ఇద్దరికీ భర్తలవల్ల బాధే లభించింది. అనసూయమ్మ తన కూతురి జీవితంలో ఆ ఆపద రాకూడదనుకొంది. కాని వచ్చి తీరింది.

ఒక సంవత్సరకాలం గడిచిన తరువాత ఒక రోజు సావిత్రీ, శ్రీదేవీ శ్రీదేవిగదిలో కూర్చొని మాట్లాడుకో నారంభించారు. శ్రీదేవికి ఈ కాలంలో ఒక కొడుకు పుట్టడం, అతనితో కాలక్షేపంచేస్తూ తన బాధను మర్చిపోవటం అలవాటయింది. శ్రీదేవి కొడుకు పేరు రజని. వాడి బాధ్యతంతా ఇంట్లోవున్న ముగ్గురు స్త్రీలు పంచుకోవడం చాలక, వేరే ఒక పనిమనిషిని వాడికోసం ప్రత్యేకంగా నియమించారు.

ఈ ఇంట్లో తనకున్న తీరికను పుస్తకాలు చదవడంలో వినియోగించసాగింది శ్రీదేవి పుస్తకాలు చదువుతూన్నకొద్దీ ఆమె బుద్ధి వికసించ నారంభించింది ఎన్నో రకాలైన ఆలోచనలు ఆమె మనస్సులోకి వస్తూండేవి. తను అంతకుముందు అర్థంకాక బాధపడే భావాలూ, అనుభవాలూ అన్నీ కూడా అర్థంకాసాగాయి. సావిత్రికి చదువంటే చాలా యిష్టం. అందుచేత ప్రసిద్ధ రచయితల రచనలన్నీ శ్రీదేవిచేత చదివించి, వాటి గురించి శ్రీదేవితో చర్చించేది ఇద్దరిమధ్యా అప్పుడప్పుడు కొన్ని అభిప్రాయభేదాలు వస్తూండేవి కానీ, మళ్ళీ సర్దుకొని పరస్పరానురాగంతో తిరిగేవారు

"నువ్వు వీణ వాయించడం మళ్ళీ ప్రారంభించకూడదూ?" అంది సావిత్రి, మూలగా, దుమ్ము పేరుకుపోయిన వీణని చూస్తూ

"ఏమిటో ఇప్పుడంత శ్రద్ధాలేదు, ఉత్సాహమూ లేదు. ఇప్పుడు నా కెంతసేపూ ఏదైనా పుస్తకం చదువుకుంటూ కాలం గడిపెయ్యాలని పిస్తుంది."

రాఘవులు : ఒరేయ్! మన హైపిస్టు సరసు ఎవరినో ప్రేమించిందని వదంతి పుట్టింది, నిజమేరా?

గోవిందం: 'వదంతులను వినకండి' 'వదంతులు ప్రచారం చేయకండి' అని పేపర్లో చదవలేదా?

కె రంగారావు

"మునుపు నువ్వెంతో బాగా వీణ వాయించేదానివి"

"దానివల్ల లాభమేమి కలిగింది చెప్పు ఎంతో కష్టపడి వీణ సాధన చేసేదాన్ని, ఏదో పెద్ద వైణికురాలి నవుదామని అనుకునేదాన్ని. అదంతా వట్టి భ్రమ అయింది. అవన్నీ జీవితంలో ఎందుకూ పనికిరావుకదా!"

"కళలు పనికిరాకపోవడమేమిటి? అందరూ పెద్ద సంగీత విద్వాంసులే కానక్కరలేదు. సంగీతం మనలో మనం ఆనందించవచ్చుగా ఏదీ, ఒక్కసారి ఆ వీణ తీసి వాయించు" అని అడిగింది సావిత్రి

అప్పుడు సాయంకాలం ఆరుగంటలయింది. ఇద్దరూ మేడమీద శ్రీదేవి గదిలో కుర్చీలలో కూచొని మాట్లాడుతున్నారు శ్రీదేవి గది కిటికీ తలుపు తీస్తే దూరంగా గోదావరీ, బ్రిడ్జి కన్పిస్తూంటాయి. తనకు ఏమీ తోచనప్పుడు శ్రీదేవి మంచం మీద పడుకొని ఆ కిటికీలోంచి దూరంగా కన్పించే గోదావరి బ్రిడ్జిమీద వెళ్ళే రైళ్ళనీ, గోదావరిమీద కొవ్వూరు వెళ్తూండే స్టీములాంచీలను చూస్తూ కాలం గడిపేది సావిత్రి అవాళ కిటికీ తలుపు తీసి గోదావరికేసి చూసింది ఆమెకు గోదావరిని చూసినప్పుడల్లా చెప్పలేని ఆనందం కలుగుతుంది ఆ ఆనందంతో శ్రీదేవివైపు చూచింది

శ్రీదేవి వీణ దగ్గర కూర్చుంది ముందు తీగెలను శృతి చేసింది మోహనరాగం ఆలాపించడం ప్రారంభించింది. సావిత్రికి అటు గోదావరీ ఆకాశం కలిసి ఒక సుందర దృశ్యాన్ని గోచరింపజేశాయి. ఇటు శ్రీదేవి వీణమీద మోహనరాగం ఆలాపించడం ఆమెకు చాలా హాయినిచ్చింది. కంటికి కన్పించేదీ, చెవికి విన్పించేదీ—రెండూ ఆమె కానందాన్నిస్తున్నాయి "నను పాలింప నడచి వచ్చితివో" అనే త్యాగరాజ కీర్తన ఎత్తుకుంది శ్రీదేవి చాలా కాలంబట్టి ప్రాక్టీసు లేకపోయినా, ఆమె వేళ్ళు మంటలు పెట్తున్నాయి కాని, వాయిద్యంలోని సొగసు పోలేదు. పాటయ్యేటప్పటికి సావిత్రి శ్రీదేవివద్దకు వచ్చి, "ఎంత బాగా వాయించావు!" అంటూ తన రెండు చేతుల్తోనూ శ్రీదేవిని కావిలించుకొని, ఆమె బుగ్గమీద ముద్దు పెట్టుకుంది. శ్రీదేవి నవ్వింది.

"ఇవాళ నా మనస్సు చాలా సంతోషంగా ఉంది" అంది సావిత్రి.

"నాకు ఈ వీణ వాయిస్తూంటే పాత రోజులు జ్ఞాపకమొచ్చాయి. జగన్నాథంగారు కన్పించి చాలా కాలమైంది ఆయన ఉంటే అప్పుడప్పుడు వచ్చి, కాస్సేపు మాట్లాడి వెళ్ళిపోతూండేవారు. అసలాయన ఈ ఊరు విడిచే రెండేళ్లకుపైగా అయివుట్నుంది."

"ఆయన చాలా మంచివారు ఇవాళ నీ పాట వింటుంటే నీకే కాదు, నాకు కూడా పాత విషయాలు జ్ఞాపక మొస్తున్నాయి."

"అవేమిటో చెప్పకూడదా అక్కా! నన్నుల్నింతర్నీ వందలకొద్దీ ప్రశ్నలువేసి, నా ప్రేమ జీవితం గురించి వాగించేస్తావు గాని, నీ సంగతేమి చెప్పవుకదా?" అంది శ్రీదేవి కోపం అభినయిస్తూ

సావిత్రి ఎక్కడో చూస్తూ మాట్లాడసాగింది. "చెప్తాను చెల్లీ మునుపు ఆ విషయం తల్చుకున్నప్పుడల్లా దుఃఖం వచ్చేది కానీ, ఇప్పుడు నా మనస్సు కొంత ప్రపంచానుభవం గడించి ఆ విషయం గురించి దుఃఖించని స్థితికి వచ్చింది. ఆ విషయం నీకు గాని, శ్యామలకు గానీ చెప్పకపోవడానికి కారణం, మిమ్మల్ని నొప్పించకూడదనే ఉద్దేశంతోనే. నే నొక మొండిజీవిని నాకు కోపం, పట్టుదలా ఎక్కువ కొన్నాళ్ళు ఏవో పిచ్చి పన్లుచేసి, విధిమీదే పగ దీర్చుకుందామనుకున్నాను. కాని, నా అదృష్టంకొద్దీ నీ స్నేహం లభించింది. నీ వల్ల నేను చాలా దారిలోకి వచ్చాను"

"నావల్లా! అబద్ధం! నేను నీవల్ల ఎంతో ఉపకారం పొందాను. నువ్వు నాకు సరియైన సలహా నిచ్చి, సరియైన సమయంలో ఆదుకున్నావుకాని, లేకపోతే నే నేమయ్యేదాన్నో?"

"లేదు శ్రీదేవీ! నీ సంగతి నీకు తెలియదు. నీలో ఒక పవిత్రతా, సరళతా, నిజాయితీ ఉన్నాయి. నీ హృదయం నిర్మలమైనది. నీ ప్రవర్తనలో ఎవరూ వేలెత్తి తప్పు చూపలేరు. నిన్ను మరో విధంగా లొంగదీసుకోగలిగితే వేణు నిన్ను పెళ్ళి చేసుకునేవాడుకాదు! కానీ, నీ నిర్మల మనఃస్థితిని చూసి వివాహం చేసుకోక తప్పిందికాదు. నీ అంత చక్కని ప్రవర్తన కలిగిన యువతీ యువకులు అరుదు. నీ స్నేహం లభించిన దగ్గర్నుంచి నీలోని నిర్మలత నన్ను కూడా ఆవరించింది. అప్పటికి నేను చాలా ఉద్రేక పరిస్థితిలో ఉన్నాను. నా

—49 వ పేజీ చూడండి

# దగ్గు మరియు రొంపనుండి
# నిజమైన స్వస్థత పొందుటకు







# సిరోలిన్ వాడండి




దగ్గు లేక రొంపను అశ్రద్ధచేయకండి సిరోలిన్ వాడి నిరపాయముగా, శీఘ్రముగా నిజమైన స్వస్థత పొందండి సిరోలిన్ దగ్గును ఆపుటయేకాదు. అది మీ దగ్గుకు మూలకారణమైన హానికరమగు సూక్ష్మ క్రిములను నశింపచేయును, కఫమును నుసను పోగొట్టును. సిరోలిన్ ఎంత కష్టమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత చేకూర్చును. దాని పనితనమును బట్టియు రుచిని బట్టియు సిరోలిన్ కుటుంబములోని వారి అందరి అభిమాన పాత్రమై యున్నది. పిల్లలకు సిరోలిన్ అంటే ఎంతో ప్రీతి.

**మీ యింట్లో సిరోలిన్ తప్పక ఉంచండి**

'రోష్' తయారు * సోల్ డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

JWT VT 2397



అమెరికన్ రాబర్ట్ జాఫ్రే నృత్యబృందం చార్మినార్‌ను సందర్శించారు.

# రాజధానీ నగరంలో రకరకాల ప్రదర్శనల కోలాహలం

అక్టోబరునాటి రక్షణనిధి డబ్బాల మోత తగ్గిపోయింది. ఎవరు పడితే వాళ్ళు, ఎక్కడ పడితే అక్కడ దేశభక్తిని ఒలకపోసుకుని, డబ్బులంటూ చుట్టూ మూగటం నమసిపోయింది. అయితే ఇప్పుడు జాతీయ రక్షణనిధి వసూళ్లను మానారని కాదు. అప్పటికంటె ఎన్నో రెట్లు ఈ నెలరోజుల మధ్య వసూలు చేశారు. వసూళ్లలో పోటీలు పడ్డారు. రాష్ట్రాలు, ముఖ్యమంత్రులే కేవలం గుత్తకు తీసుకున్నట్లు, ఎవ రెక్కువ వసూలు చేస్తే వాళ్ళ నెహ్రూ కనుసన్నలలో స్వేచ్ఛగా మెలగచ్చునే భావమో యేమో, రాష్ట్రానికింతని, ఫలానా రాష్ట్రం ఇంత వసూలు చేస్తే మరి మీరేం చేశారనే ప్రశ్నకు సమాధానంగా, జైత్రయాత్రకు బయలుదేరారు మన రాష్ట్ర మంత్రులు. తలకొక రూపాయి చొప్పున ఆంధ్రప్రదేశ్‌లో వసూలు కావాలని, ఆ అంచనా ప్రకారం మూడున్నర కోట్ల రూపాయలు సేకరించాలని బయలుదేరారు. రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదవా అని ఇట్టే వచ్చిపడ్డాయి నోట్లకు నోట్లు. నోట్లల్లో తులతూగి, నోట్ల దండలు మెళ్లో వేసుకుని, నానా బీభత్సంచేసిపారేశారు. అయితే ఈ నిధి సేకరించటంలో వత్తిడి ఉండరాదని, ఎవరంతటవారు ఆవేశాపరులై, దేశభక్తి ప్రబోధితులై డబ్బు ఇవ్వాలని పండిట్ నెహ్రూ ఆశాభావం. ఆయన కొంచిన ఫిర్యాదుల దృష్ట్యా బలవంతం చెయ్యకూడదని రాష్ట్రాలకు హితవు చెప్పారు. అయితే మంత్రివర్యులు తెగబడి, నిలబడి అడుగుతుంటే ఎవరికైనా ఇవ్వక పోవటానికి దమ్ముంటుందా? ఇది ప్రత్యక్షంగా వత్తిడి చేస్తున్నారని మనం అనలేము. పరోక్షంగా ఇదొక విధమైన అనివార్యమైన వత్తిడి అని అంగీకరించక తప్పదు. ఈ మధ్య ఒకాఫీసరు ఓ దరఖాస్తును పరిశీలిస్తూ, దానిమీద ఈ విధంగా వ్రాశాడుట, ప్రక్కాఫీసరుకు పంపిస్తూ: "ఈ దరఖాస్తుదారుడు నా మేనల్లుడు అవటంవలన, నేను 'డీల్' చేయటం భావ్యంకాదు; మీరు చూడండి" అని. విడదీసి చెప్పక్కర్లేదనుకుంటాను.

జిల్లాల్నుంచి బైటపడ్డారు. ఇక హైదరాబాద్, సికింద్రాబాద్‌నగరాల్లో ఈవసూళ్లకువిజృంభిస్తారుట. రాజధానిలో భాగ్యవంతులకు కొదవలేదు, ఇక బీదవాళ్ల విషయం సరేసరి. భాగ్యవంతుల్లో భాగ్యవంతుడు, నిజాము ఉండనే ఉన్నాడు. ఆయన బీదవాళ్లల్లో బీదవాడని గాబోలు ఓ వ్యక్తి ఆయనకు ఈమధ్య ఓ రూపాయి మనిఆర్డర్ చేశాడుట. డబ్బివ్వమంటే ఇవ్వకలిగిందేమిటో అదివరకే ఇచ్చేశాను; ఇంకా నా జోలికి రావద్దన్నాడు. ఇదేమన్యాయం, అందరూ కూడా గంపెడంతాశ పెట్టుకుని, సంచులు కుమ్మరిస్తాడనుకుంటే, ఎడంచెయ్యి చూపిచాడు. అయితే అంత మా॥ తాన నిజామును వదలిపెడతారంటే నమ్మలేని విషయం. ఈ మధ్య లాల్‌బహదూర్(కేంద్ర హోంశాఖామంత్రి) నిజాముమీద ఓ విసురు విసిరారు. ఆయన సలహాదార్లు ఆయనను పెడదోవ పట్టిస్తున్నారు అన్నాడు. ఈ ముక్క నిజంగా మనస్సుకు తీసుకుని నిజాం తన సలహాదారునికి ఉద్వాసన చెప్పటానికి ఒక అవకాశం; రెండోది: ఒకరు సలహా చెసితే మనం వింటాం ఏమిటి? ఇదిగో, ఈ సంచి ఒకటి తీసుకోమని, తన అసహజమైన దాతృత్వాన్ని రుజువు చేసుకోవటానికి అవకాశంవుంది! అయితే ఈ రెంటిలోనూ ఏదీ జరిగే సూచన ఇంతవరకు కనిపించటంలేదు."

ఇకపోతే రవీంద్ర భారతిలో మూడు రోజుల పాటు నృత్య ప్రదర్శనాలు జరుగుతున్నాయి. ఇది కేవలం లోకల్ టాలెంట్‌కాదు. అంటే పొరుగింటి పుల్లకూర రుచి అని అర్థం చెప్పుకోవాలి. ఈ నర్తకులు అమెరికా దేశవాసులు. ఆరేళ్ల క్రిందట, కొంతమంది ఎమెచూర్స్‌తో ఈ నృత్య భంగిమలు ప్రారంభించి కథాత్మకంగా జీవితాలు చేసుకుని, పట్టుదలతో భక్తిశ్రద్ధలతో అనేకచోట్ల ప్రదర్శనలు ఇచ్చి, సాంప్రదాయసిద్ధమైన రీతితోపాటు, ఆధునిక నృత్య రీతులు ఆకళింపు చేసుకుని, దేశ దేశాల్లోను, విమర్శకుల, రసికుల మెప్పుల, మన్ననలను పొందిన ఘటికులు రాబర్ట్ జాఫ్రే బృందం, జాతీయ రక్షణనిధి నిమిత్తమై, ఉచిత ప్రదర్శనలు ఇస్తున్నారు. అసలు నిజంగా ఆలోచిస్తే ఈ అమెరికన్లు ఇక్కడ మన ముందు డ్యాన్స్ చెయ్యటమేమిటి! వైట్‌హౌస్‌… ప్రముఖులే మన నాయకులముందు డ్యాన్స్ చేస్తారు. వాళ్ళ డ్యాన్స్ వేస్తే, అయితే మనకు సాంప్రదాయసిద్ధమైన డ్యాన్స్ వేరే ఉన్నాంగా మరి. కాని వాళ్లకు నచ్చేవి, మనం మెచ్చేవి కొన్ని ఉన్నాయి. కాని, ఏంప్రయోజనం? సంకటంలా?

సరే; ఈ నృత్యాల మాట అటుంచండి. మన సినిమా స్టార్స్ ఉండనే ఉన్నరు. అందులో మరీ బొంబాయిస్టార్లంటే ఇక్కడిజనంవిరగబడిచూస్తారు వాళ్ళ భారీ ఎత్తున, విమానంలో దిగుతున్నారు చాచా ప్రదర్శనలు ఇచ్చి, జాతీయ రక్షణనిధిని ఇట్టే పెంచేస్తారు. ఏ ప్రదర్శనలు ఇవ్వకపోయినా చాలు, ఆ జీవులు వచ్చి, విగ్రహాల్లాగ నిలబడ్డా, కళ్లారా తనివితీరా చూడటానికి, టిక్కెట్లు కొనుక్కోవటానికి క్యూలో ఇరవై నాలుగు గంటలు నిలబడటానికి పోటీపడేవాళ్ళు కోకొల్లలుగా కనిపిస్తారు. మరి వాంచ్చి, ఏ మెడ తిప్పో, ఏ తల ఎత్తో నాలుగు రకాల పోజుల్లో కనిపిస్తే, చూడటానికి ఎంత టిక్కెట్టు పెడితే మాత్రం యేం; జన్మ తరించిందని వచ్చి కూర్చుంటారు. వీరిని చూడటానికి వెళ్ళిన జనమంతా దేశభక్తులక్రిందే మనం లెక్కెయ్యాలసివస్తుంది. కారణం: జాతీయ రక్షణ నిధి వసూలుకు తోడ్పడటంలేదా! నేను మాత్రం రెండు రూపాయల టిక్కెట్టు కొనలేదా అన్నట్టు. నిజంగా దేశభక్తికి, రక్షణనిధి వసూలుకు లంకె పెడితే, వీళ్ళంతా ఆ జాతిక్రిందే వచ్చి తీరాల్సిందే.

కోలాహలం హెచ్చిపోతోంది, పట్నమంతా. ఓ మూల ఎగ్జిబిషన్‌రోజులు దగ్గరపడ్డాయి. వింతలు, వినోదాలు, విలాసాలు, విచిత్రాలతో కాలక్షేపం అయిపోయింది. మరి రాజధాని ప్రజలకు

53-వ పేజీ చూడండి

# వనితాలోకం

# శిరోజాలంకారాలు

ఎం. ఎల్.

తరుణికి కురులే సిరులు. అంత విలువైన కురులను చెలువలు అలంకరించకుండా ఊరుకుంటారా? అదీగాక, ఎంత వెలలేని వస్తువైనా సానబెట్టక పోతే రాణించదు కదా! కురులను అలంకారాలతో సింగారించుకుంటే చెప్పలేని అందాన్ని విరజిమ్ము తాయి.

జడకుప్పెలతో వయ్యారంగా వ్రేలాడే వాలు జడలో అందాలు పందాలు వేసుకుని జాలువారుతూ వుంటాయి. జడగంటలు వేడుకగా ఊగుతూ వుంటే, వాటిమీది బంగారుకుప్పెలు లతలు, పనసపండు, గుమ్మడిపండు మొదలైన చక్కని డిజైన్లతో తళుకులీనుతూ ఉంటాయి. మూడు కుప్పెలమీద ఒకే డిజైను ఉండాలని నియమం ఏమీ లేదు. సాధారణంగా రకరకాలవి ఉంటాయి కూడా. దుబ్బుగా చేరిన నల్లని, మెత్తని పట్టు దారాల వుండలు, ఆ మూడింటి మకుటాన బంగారు కిరీటాలూ, 'జడగంటలు' కడు రమ్యమైన అలంకారం.

జడకుప్పెలతోపాటు శిరోభాగంపై నాగరాన్ని తప్పక ధరించేవారు. ఈ రెండూ విడదీయరాని జోడుగా ఉండేవి. నాగరం బిళ్ళపై లక్ష్మి, సరస్వతిలాంటి చక్కని బొమ్మలు చెక్కుతారు. ముస్లిమ్ వనితలు నాగరాలపై తాజ్ మహల్ మొదలైన మసీదు బొమ్మలు చెక్కించుకుంటారు. నాగరంక్రింద వ్రేలాడే గజ్జెలు అరచంద్రాకారంలో ముద్దులొలుకుతూ ఉంటాయి. నాగరం అడుగున వుండే కొక్కెంలో వెంట్రుకలు దూర్చి చిన్న జడ అల్లి, దాన్ని మామూలు జడలో కలిపేసి అల్లుకుంటారు. దాంతో నడినెత్తిన నాగరం కుదురుగా నిలబడి సోయగాలు చిందిస్తూ ఎదురెవరని సవాలుచేస్తుంది.

అయితే నాగరికత పెరగటంతో, ఈ నగలను చిన్న చూపుచూడటం మొదలుపెట్టారు. అందులోనూ నెత్తినెక్కించుకున్న నాగరాన్ని ఏకంగా వేలకు గిరవాటేశారుకదా! ఇప్పుడు నాగరం ముఖం చూసేవారే లేరు. కాకపోతే, కురులతో సరాగాలాడే వయ్యారి జడగంటలంటే మోజుపడేవారు ఇప్పటికీ కన్పిస్తూన్నే వునారు.

జడగంటల్లో ఊలుబంతులవి ఒక రకం. ఫ్యాన్సీషాపుల్లో రూపాయి పెడితేసరి రంగురంగుల జడగంటలు మనవడిలో వచ్చి వ్రాలతాయి. పైన ముఖమల్ చుట్టిన మట్టి జడగంటలను అప్పుడప్పుడు వాడుకుంటే చాలా రోజుల దాకా పాడవ్వకుండా ఉంటాయి.

జడకుచ్చులు కొంతకాలంక్రిందట ఎంతో ఫాషనుగా వుండేవి. జడగంటలకూ, వాటికీ ఒకటే తేడా. జడగంటల్లోవుండేవి మూడు కుప్పెలయితే కుచ్చుల్లో రెండు మాత్రమే వుంటాయి. ఆ కుప్పెలు ఎంత పొడుగ్గావుంటే అంత మనసుపడేవారు మగువలు.

శిరోభాగంలో అందాలు విరజిమ్మే మరో రెండు ఆభరణాలున్నాయి. రాళ్ళతో పొదిగిన గుండ్రని బిళ్ళ రాగిడి ధగ ధగా మెరుస్తూ నేత్ర పర్వం చేస్తుంది. మెలికలు తిరిగి పడగవిత్తే నాగరాజా వళ్ళంతా, రాళ్ళతో 'నాగం' రమణీయంగా ఉంటుంది.

వాలుజడ మధ్యలో చామంతిబిళ్ళ వెలలేని కాంతిని విరజిమ్ముతూ ఉంటుంది. చామంతి బిళ్ళల్లో పలురకాలు ఉంటాయి. కొన్ని పువ్వు ఆకారంలోవుంటే, మరికొన్ని వంకలేని గుండ్రని రూపంలో వుంటాయి. కేవలం బంగారంతో చిన్న చామంతి పూలను చేయించుకుంటారు. అయితే రాళ్ళ చామంతిలోని అందం పోటీ లేనిది. ఈ నగను సిగమధ్యలోకూడా ధరించవచ్చు.

వదనానికి శోభతెచ్చే పాపిటబిళ్ళ, సూర్యుడు చంద్రుడు కనువిందైన అలంకారాలు. తిన్న పాపిటలో తీరుగా మెరిసే పాపిటగొలును, నుదుటిమీద ముంగురులకుమల్లే కదలాడే రాళ్ళపతకం, చెలువలకు చెప్పరాని అలంకారం. పాపిటబిందె పెట్టుకోవాలంటే, పక్కపాపిట వెనక్కునెట్టి మధ్యపాపిటను తీసుకోవాల్సిందే! ఆచెంపా, ఈ చెంపా పసిడికిరణాలను వెదజల్లే గుండ్రని 'సూర్యుడు' వన్నెలు చిందించే నెలవంక ఆకారంలోని 'చంద్రుడు', ఈ రెండు నగలూ రవిచంద్రుల శోభను రాళ్ళల్లో మెరిపిస్తాయి. నుదుటిముందు చక్కని రాళ్ళగొలుసును భాషికంలా అలంకరించుకుంటారు. ఈ అలంకారాలు నర్తకీమణులకు బాగా నప్పుతాయి.

చెంప పిన్నులు పెట్టుకోని అతివలు అరుదు. బజారుల్లో దొరికే మామూలు చెంపపిన్నుల్లో నల్లనివాటికి ఎక్కువ ప్రచారం. నల్లవాటిలోనూ సాదావి, వంకీలవి, రకరకాల స్టైలువి ఉంటాయి. ఇదివరలో రంగురంగుల చెంప పిన్నులుకూడా వచ్చేవి. అంత నాణ్యంగా ఉండక పోయినా, ఇప్పుడుకూడా మళ్ళా రంగులవి వస్తున్నాయి.

పోతే, బంగారంలోకూడా చెంపపిన్నులు చేయించుకుని పెట్టుకుంటున్నారు కొందరు. అందులోనూ రాళ్ళవి, వంకీలవి ధరించినవారిని కూడా చూశాను.

సిగవేసుకునేవారికి ప్రత్యేకంగా కొన్ని అలంకారాలున్నాయి. కొంతమంది సిగపిన్నులను వెండితో చేయించుకుంటారు. మరికొందరు వాటిమీద బంగారంతో చిన్న పువ్వేదో వేయించుకుని, అందులో చక్కనిరాళ్ళు తాపడం చేయించుకుంటారు. అవి సిగమీద జిగేలుమని మెరుస్తూ కనపడతాయి. మామూలుగా అందరికీ అందుబాటులో రబ్బరు పిన్నులు మొదలైనవి ఉండనే ఉన్నాయి.

స్వయంగా చూడలేదు కాని 'బంగారు జడ' అందం చెప్ప తరంకాదని, దానిమీద రామాయణాది కావ్యాలను క్లుప్తంగా చెక్కుతారని అమ్మ చెపుతూ వుంటుంది.

ఇకపోతే, రాజ్యాలేలే పుట్టుక పుట్టిన తరుణి ప్రత్యేకంగా ధరించవలసిన ఆభరణం ఒకటి వున్నది. రాణి మకుటాన వజ్ర వైడూర్యాలతో ప్రకాశించే కిరీటానికి ఏ నగ సాటి వస్తుంది? అయితే అందరికీ ఆ జన్మరాదు. తతిమా వారికి కూడా ఆ నగమీద (నకిలీ కావచ్చు) మోజువుంటే ఏ సినిమాల్లోనో చేరాలి, చేర్చుకోకపోతే నాటకాల్లోనన్నా (రాణి) వేషాలెయ్యాలే తప్ప మరోదారిలేదు! ★






## అందాలకు చిట్కాలు

వైరాణిగారు వ్రాస్తున్న అందాలకు చిట్కాలు ఏమంత బాగాలేదు. ఈ మేకప్ మన భారత స్త్రీలకు తగదని నా అభిప్రాయము. విదేశీ యువతులకు ఇట్లాంటి మేకప్‌లు, లిప్‌స్టిక్‌లు తగుతాయి గాని, మన భారత స్త్రీలకు మాత్రము చాలా అసహ్యకరంగా ఉంటాయి. ఇప్పటికే మన పవిత్రమైన భారత స్త్రీలు సినిమాలు చూచి, వేష భాషలలో చాలా అసభ్యకరంగా తయారవుతున్నారు. భగవంతుడు ఇచ్చిన అందచందమ్ములు ఉంటాయిగా. ఇలాంటి కృత్రిమ అలంకరణలు చేసుకొనుట చాలా శోచనీయము. ఒక్కసారి, మన గాంధీజీని తలచుకొనండి. ఆ మహనీయుడు మన ఎదుట లేకపోయినను, ఖద్దరు కట్టమని దీవిస్తూనే ఉంటారు. ఆ మహనీయుని అడుగుజాడలలో నడుచుకొనాలి గాని, ఈ మేకప్‌లు మనకు తగినవి కావు.

పి. పెద్దపాప (నారాయణపురంమెట్టు)

*  *  *

ప్రారంభంలోనే తలనొప్పి వచ్చేటట్లు చేశారు రచయిత్రి వైరాణి. వారు చెప్పే చిట్కాలు మన వాళ్లు పాటిస్తే, పగటి వేషగాళ్లకు పోటీదారులుగా తయారవుతారనుటలో ఏమాత్రము అతిశయోక్తి ఉండదు. మనం చేసికొనే అలంకరణ ఆకర్షణీయంగా ఉండవలయును గాని, ఎబ్బెట్టుగా ఉండకూడదు. అదికూడా మన దేశాచార పరిస్థితులకు అనుగుణంగానే ఉండవలయును. వైరాణి గారు చెప్పే చిట్కాలు ఈ రెండు పద్ధతులకు వ్యతిరేకముగానే ఉన్నవి. ఇకనుంచైనా సంసార పక్షమైన అలంకరణకు ప్రాముఖ్య మిస్తారని ఆశిస్తున్నాను.

ప్రసాద్, శర్మ (ఈపూరు)

"ఈ వారం వైరాణిగారు వ్రాసిన 'అందాలకు చిట్కాలు—1' అనే వ్యాసం చదివాను. అటువంటి వ్యాసం నా అభిమాన పత్రికలో ప్రచురించటము చూచి బాధపడ్డాను. అసలు రచయిత్రి గారికి మేకప్ అంటే ఏమిటో తెలియదని చెప్పుటకు సాహసిస్తున్నాను. క్షమించ ప్రార్థన. అందముగా కనుపించుటకు టాయిలెట్ చేసుకొంటాం గాని, మేకప్ గాదు. మేకప్ అసలు మనిషి రూపాన్ని మారుస్తుంది. అందువలన డ్రామాలో వేషాలు వేసుకోటానికి మేకప్ చేసుకొంటారు గాని, అందముగా కనుపించటానికి గాదు. పౌడరు, స్నోలతో టాయిలెట్ అయ్యేది, ముఖము నునుపుగా తయారగుటకు; చెమట పట్టకుండా ఉండుటకు. అంతే గాని, మేకప్ వేసుకొంటే అందంగా కనుపించరు సరిగదా, వింత జంతువులలాగా కనిపించుదురు.

యార్లగడ్డ సాంబశివరావు (హుబ్లి)

**మేకప్ అనే మాటకి రచయిత్రి చెప్పిన అర్థం ఇంగ్లీషులో ఉంది. టాయిలెట్ అనేది దేనికయినా ఉపయోగించవచ్చు కాని, ముఖానికి సంబంధించినంతవరకూ ఈ మాటనే వాడుతారు.**

*  *  *

'అందాలకు చిట్కాలు' అనే శీర్షిక చదవగానే అసలే దేశం క్లిష్టపరిస్థితుల్లో ఉన్నది కదా; ఈ సమయంలో వనిత లందరకూ ఖర్చు పద్దు ఎక్కువ చేస్తుందేమో అని రచయిత 'వైరాణి' గారి మీద కోపం వచ్చేసింది. ఎలాగో ఓపికపట్టి చివరివరకూ చదివేక గమనిక కనుపించింది. వెంటనే నా కోపం చల్లబడింది. నాలాటివా రుంటారనే వారు ఆ వాక్యాలను వ్రాశా రనుకుంటాను.

సరోజ (వేటపాలెము)

## సవరించుకోవలసిన లోపాలు

ఎం. సరోజగారు వ్రాసిన "సవరించుకోవలసిన కొన్ని లోపాలు" చిన్నవిగాఉన్నా, రచయిత్రిగారు చక్కగా వ్యాసరూపంలో పొందుపరచారు. నాకు తెలిసినంత వరకు ఈ కాలంలో ఆడపిల్లలంటే చాలా చులకనగానే చూస్తారు. ఎవరు? మగవారుకాదు, ఆడవారే. మా అక్కయ్య అబద్ధాలాడితే, "ఊరికే అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతారు జాగ్రత్త" అని బెదిరిస్తారు మా వాళ్ళు. మా ప్రక్కింట్లో ఒక దంపతులు ఉన్నారు. వారికి ఆరుగురు ఆడపిల్లలు, నలుగురు మగపిల్లలు. వాళ్ళింట్లో బిడ్డ పుట్టిన పదకొండో రోజు మగ బిడ్డల కయితే చక్కగా నామకరణం చేసి, పండుగ చేసుకుంటారు. ఆడపిల్లలకయితే కనీసం పేరు కూడా పెట్టరు. వాళ్లే పెద్దవాళ్ళయాక తమకు తామే పేరు పెట్టుకుంటున్నారు. ఆడపిల్లలంటే అంత చులకన వాళ్ళకు. "ఆడదై పుట్టుటకంటే అడివిలో మ్రానై పుట్ట వచ్చు" అన్నారు మన పెద్దలు. మేము పంచపాండవుల వలె ఐదుమంది ఆడపిల్లలము. పూర్వజన్మంలో ఏ పాపం చేశామో కాని, ఆ పాపఫలం అనుభవించడానికి ఈ జన్మంలో ఆడపిల్లలయి పుట్టాము. కాని రచయిత్రిగారు ఈ పాపాన్నంతా పురుషులపైకి నెమ్మదిగా నెట్టేస్తున్నారు. అందువల్ల బుజువయ్యేదేమిటంటే ఆడపిల్లలయి పుట్టటంవల్ల ఆడవారే కాకుండా, మగవారు కూడా ఆ పాప ఫలాన్ని అనుభవించాలన్నమాట! ఈ ఒక్క చిన్న విషయంలో మాత్రం నేను రచయిత్రిగారితో ఏకీభవించలేకపోతున్నాను. మిగతా విషయాలకు మాత్రం రచయిత్రిగారితో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఏడుస్తూ పుట్టి, ఏడుస్తూ పెరిగి, ఇతరులనూ ఏడిపిస్తూ ఆఖరికి ఏడుస్తూ ప్రాణాలు విడిచేది ఆడపిల్లలే!! పుట్టినందుకు ఇది తప్ప మరేమీ సాధించలేరు వీరు.

కుమారి టి. భూమాదేవి (హైదరాబాద్)

## మనోబలం

దాదాపు రెండు మూడు సంవత్సరముల తరువాత మీ "వనితాలోకం" శీర్షికలో ఒక ఉపయుక్తమైన వ్యాసం "మనోబలం" వెలువడింది. ఇటువంటి వ్యాసములు కొంతవరకు వనితల పురోభివృద్ధికి తోడ్పడే అవకాశముంది. ఇటీవల కొంతకాలంగా వెలువడుతున్న వ్యాసాలు చూస్తూఉంటే, అసలు మన వనితలు బాగుపడే అవకాశముంటూ లేదేమో అనిపించింది. నిజమైన అనేక సమస్యలు ఉన్నవి. వీటి విషయమై స్త్రీ పురుషులు సమిష్టిగా వ్యాస పరంపరలలో చర్చిస్తే కొంత మేలు కలుగవచ్చును.

యువతీ యువకులకు పూర్తిగా అర్థంకానిది, తరచు వారు ఆలోచించేది "ప్రేమ". నిజానికి ఈ ప్రేమ అనేది, దాని నిర్దుష్టమైన రూపంలో లభించేది బహు అరుదుగా ఉంటుంది. కాని, తాత్కాలికమైన ఉద్రేకాలను ప్రేమకు పర్యాయపదంగా ఊహించి, నేటి స్త్రీ, పురుషులు అనేక అనర్థాలకు కారణభూతులవుతున్నది నిర్వివాదాంశము. ఈవిషయాన్ని శ్రీమతి రత్నా మహీధర్‌గారు ఉన్నంతలో బాగా చర్చించారు. కాని, స్థలాభావం చేత కాబోలు విపులమైన చర్చకు పూనుకోలేదు. ఈసందర్భంలో ఒక సూచన. ఇటువంటి సృజనాత్మకమైన సమస్యలపై చర్చలకు కలిగిన స్థలం ఎక్కువ చేయాలి. కేవలం ఒక్క పేజీకీ పరిమితమై యుండాలన్న నియమం ఉండకూడదు. ఇటువంటి చర్చలలో పాల్గొనేందుకు పురుషులకు కూడా అవకాశం ఉండాలి. ఎందుచేతనంటే స్త్రీ పురుషుల కలయిక వల్లనే అనేక పరిస్థితులు, సమస్యలు ఏర్పడతాయి. కనుక ఒకరికి సంబంధించిన సమస్యలతో మరియొకరికి ప్రత్యక్షంగాకాని, పరోక్షంగాకాని సంబంధముంటుంది. కనుక ఆ యా సమస్యల పరిష్కారానికి చర్చలో ఇరువురూ పాల్గొనే ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఇది గుర్తించి వలసిన మార్పులు చేయాలని కోరుతున్నాను.

చింతలపూడి సుబ్రాజా (విజయపురి)

*  *  *

(1) తల్లిదండ్రులు పొరుగూరుకి ఉద్యోగానికి పంపటంలేదన్నారు. అధమం, ఇంకా పై చదువులకు (యూనివర్శిటీలకు) అసలే 'ధైర్యం చేసి' పంపరు. ఎ. చదవగల సమర్థత, బి. చదివించగల స్థోమత వున్నప్పుడు మాత్రమే యూనివర్శిటీకి పంపమని అడగానికి ధైర్యం వుంటుందని ఎదురుప్రశ్న వేయవచ్చు. కాని నేను వ్రాసేది, పై రెండు లక్షణాలు సమకూడిన వారిని గూర్చి మాత్రమే,

(2) ఒకవేళ పంపిన, ఆంధ్రప్రదేశ్‌కు వచ్చిన తర్వాత ప్రతిఒక్కరు 'వింతగొడ్డు'ను చూచినట్లు చూస్తారు. అంతేకాదు, ఇక్కడవుండే విద్యార్థులుకూడ వింతగా చూస్తారు. ఇప్పుడు ఇక్కడ మనవారుకూడా కొందరు, వీరి స్థానాలకుబదులు మగవారికి 'సీట్లు' ఇస్తే బాగుండేది అనుకునేవారు **కూడా వుండకుండా వుండరనేది నమ్మదగ్గ విష**

యం కాదనుకుంటానికి అనుమానంలేదని చెప్ప వచ్చు.

మిగతా యూనివర్సిటీల్లోని (ఆంధ్ర విద్యార్థినులు) వారికికూడా ఇటువంటి ఉద్దేశాలు గలగటం అనేది వనితావాణి ద్వారా పంపగలరని, దీనినిగూర్చి వాదోప వాదములు చేయవలసిన పనిలేదని నా మనవి.

ఎం. కృష్ణకుమారి (కాశి)

* * *

ఎస్. సుందరిగారు అంతా ఎదుటివారికోసమే అన్నట్టు రాశారు. మనకి వీలయినది, సబబయినదిగా వున్నప్పుడు ఎదుటివారు ఏమనుకుంటేనేమి ? ఒకరికోసం కాదుకదా మనం జీవించేది ? ఏదన్నా వినడానికి కొంతవరకేఉంది. కాని పూర్తిగా ఎదుటివారి మాటమీద ఆధారపడకూడదు. అందరూ ఇలా ఏకమయితే నోటికొచ్చినట్టు మాట్లాడేవారికి కొంతవరకు తాళం పడుతుంది. కానీ ఆమె అన్నది నిజం. మనం ఎంతచెప్పినా కంఠశోషే మిగుల్తోంది. ఏనాటికైనా లోకం కళ్ళువిప్పదా ? స్త్రీలపరిస్థితి బాగుపడదా అని నా నమ్మకం.

శ్రీమతి పి. రత్నమాల (సికింద్రాబాద్)

* * *

వ్యాసం చదువుకొన్న పురుషులు కొంతవరకు బాగుపడగలరు. పరాయి ఆడపిల్లలను వెంబడించి, వారిని నవ్వుపాలు చేయువారు, తమ ఆడపిల్లలకు ఇటువంటివి జరుగవచ్చునేమో అని తెలుసుకొని బాగుపడగలరు. కాని, అక్కయ్యా! కేవలము పురుషులవే అలా అనుట న్యాయముకాదు. మా పక్కింటి అబ్బాయిని ఒక అమ్మాయి ప్రేమించి, నమ్మించి అతనికి ద్రోహము చేసినది. అలాంటి ఆడవారిని ఏమనాలి? ఆడవారిలో అలాంటివారు ఉంటారంటారా? అటువంటివారు పురుషులలోనూ యున్నారు; స్త్రీలలోనూ యున్నారు. ఆ అబ్బాయి పిచ్చివాడయి తిరుగుతుంటే, నా కెంతో జాలి వేస్తున్నది. కేవలము పురుషులవే అనుట న్యాయముకాదు.

యం. శారద (కర్నూలు)

* * *

వ్యాసం బాగానే ఉన్నది. "మంత్రాలకు చింతకాయలు రాల్తాయా" అన్నట్టు ఇటువంటి వ్యాసాల వల్ల వాళ్ళ వాళ్ళ మనస్తత్వాలను మార్చుకోలేరు. ఇటువంటి లోపాలు పురుషులలోనే కాకుండా స్త్రీలలో కూడ ఉంటాయి. మాకు తెలిసిన కుటుంబం ఒకళ్ళు ఉన్నారు. ఆమెకు భర్త విషయంలో ప్రతి దానికి అనుమానమే. తనతో సమంగా ఇంటి పనులు కూడ, భర్తచేత చేయిస్తారు. ఏదైనా అవసరానికి ఇంటి పనులలో సహాయం చెయ్యవచ్చును. అంతే కాని, ఎవరైనా పై వాళ్ళు ఇంటికి వచ్చినప్పుడు కూడా మాటిపోటీ మాటలుఅంటూ, చేసుకున్నందుకు ఎవరికోసం చేస్తారు నాకు, నా పిల్లలకు అంటే, ఇక చెప్పేదేముంది! మా ఎదురింటావిడ భర్త ఎదురుగా అందరితోటీ 'ఈయన ఉత్త తెలివి తక్కువ మనిషండీ! ఏదో నా తెలివితేటలతో ఈ సంసారం నడుపుకొస్తున్నాను. మాట్లాడటం కూడా చేతకాదు' అంటూ హేళనగా మాట్లాడుతుంది. అటువంటప్పుడు ఆ భర్త ఎంత బాధ పడతాడు చెప్పండి. కనుక భార్యాభర్తలు కూడ వాళ్ళ వాళ్ళ లోపాలను ఎప్పటికప్పుడు తెలుసుకుని, సవరించుకుపోతుంటే సంసారం సుఖంగా సాగిపోతుంది. చిలికి చిలికి గాలివాన చేయకూడదు.

కె. వి. లక్ష్మి (గజపతి నగరం) ★

# అందాలకు చిట్కాలు - 4

## చేతులు

చేతులు అందంగా ఉంచుకుంటే, వ్యక్తి అందం మరి కొంత ఎక్కువయినట్లు అనిపిస్తుంది!

చేతిమీద చర్మంలో నూనె పదార్థాలు అధికంగా ఉత్పత్తి అవవు. అందుకనే చేతిమీద ముడతలు తొందరగా అగుపిస్తాయి. చేతులకి ప్రత్యేకంగా తయారుచేసిన 'లోషన్లు, క్రీమ్‌లు' వాడగలిగితే సరే లేకపోతే ఎప్పటికప్పుడు నూనె రాసి శుభ్రంగా సబ్బుతో కడిగేస్తూ ఉండాలి.

మీ చేతుల సంగతి మర్చిపోకండి.

## గోళ్లకి పాలిష్

ఇది వేసుకునేవారికి: ఇది వేసుకునేవారు గోళ్లు కొంచెం పొడుగ్గా పెంచుతారు. అయితే ఈ గోళ్ల ఆకారం జాగ్రత్తగా ఉంచాలి. ఇష్టంవచ్చినట్లు పెరగనీకుండా మొనలను మరీ గుండ్రంగా కాకుండా, మరీ మొనతేలినట్లూ కాకుండా కత్తిరించి, అరగతీయుటం మంచిది.

గోళ్లను శుభ్రం చేసిన తర్వాత పాలిష్ వెయ్యాలి. [గోళ్ళ చిగుళ్ళను కొద్దిగా కిందికి తోసి అక్కడంతా పాలిష్ వెయ్యడం చెయ్యదగ్గ పని.] ఒకసారి పాలిష్ వేసి, ఎండిన తర్వాత మరొకసారి కూడా వేస్తే ఎక్కువ కాలం ఉంటుంది!

## పగిలే గోళ్లు

కొందరి గోళ్లు నిలువుగా చిట్లుతూ ఉంటాయి. దీనికి మందు 'జిలాటిన్' (Gelatin) అని చెప్తారు. జిలాటిన్ రోజూ తింటే ఇది తగ్గుతుందిట! [జిలాటిన్ ప్రొటీన్ పదార్థం. అయిస్ క్రీమ్‌లలో జెల్లీలలో వేస్తారు.]

## గోళ్లకి రంగులు

సన్నటి పొడుగాటి చేతులుండేవారికి రంగులు బాగా నప్పుతాయి. 'గుండ్రటి' చేతులుండేవారు రంగులేని పాలిష్ వాడితే బావుంటుంది.

## సబ్బులు

సబ్బువల్ల చర్మము ముడతలు పడుతుందన్న సంగతి బట్టల సబ్బుతో పనిచేసిన వారందరికీ తెలిసినదే! బట్టల సబ్బులవంటివి చర్మములోని నూనె పదార్థాలను తీసివేస్తాయి.

—వైరాజీ. ★

# వంటలు

## పొట్లకాయ పచ్చడి

| | |
|---|---|
| పొట్లకాయ | సుమారు 3 అవున్సులు |
| పెరుగు | $\frac{3}{4}$ కప్పు |
| ఆవాలు | $\frac{1}{2}$ చెంచా |
| ఉప్పు | 1 చెంచా |
| పచ్చిమిరపకాయలు | 2 లేక మూడు |
| నూనె | 2 చెంచాలు |
| కొబ్బరికోరు | 1 అవున్సు |

[సుమారు 28 గ్రాములు ఒక అవున్సు. 1000 గ్రాములు ఒక కిలో గ్రాము.] పొట్లకాయ కోసి, గింజలు తీసి, సన్నగా తరిగి, నూనెలో వేయించాలి. పెరుగుకి కొబ్బరి, వండిన పొట్లకాయ కలిపి, ఆవ, పచ్చిమిరప చేర్చాలి. ★




చుట్టూరా కటిక చీకటి.

ఎముకలు కొరుక్కుతినే చలి.

బూట్లలో కాళ్ళు మండుతున్నాయి.

చేతిలో రైఫిల్ వుందీ లేందీ తెలీటంలేదు. కళ్ళు మూసుకున్నాడు రాజా. కళ్ళు మండుతున్నాయి. రివ్వున వీచే చలిగాలికి కనుకొలకుల్లోంచి క్రిందకు రాలుతున్నాయి నీళ్ళు; క్రింద పడగానే గడ్డ కట్టుకుంటాయి.

దాదాపు గంట నుంచీ ఎక్కడా శబ్దంలేదు. అప్పుడప్పుడూ ప్రక్కనుంచీ రాంసింగ్ దగ్గు మాత్రం వినిపిస్తుంది. మరోవేపు నాయర్ గొంతు సన్నగా "రాజాభాయ్" అని వినిపించింది.

"క్యాహై నాయర్ ?" అన్నాడు రాజా.

"చీనీ రాక్షసులు నిద్రపోతున్నారా ?" అని అడిగాడు నాయర్.

"ఏమో ! నిన్న రాత్రీ ఇలాగే చేశారుకదా. నమ్మలేం."

"రైట్ భాయీ—సరిగ్గా అన్నావు" అన్నాడు రాంసింగ్ ....

"సిగరెట్టుంటే బాగుణ్ణు" అన్నాడు నాయర్.

నాయర్‌కు సిగరెట్ కావాలి ! రాంసింగ్‌కు వాళ్ళ వూరికి పోయి పొలంలో తిరగాలని ఉంది ! తనకు.... అంత చలిలోనూ వళ్ళు మండుకుపోతూంది తనకు.

"పిరికివాడివి నీవు ! నువ్వెందుకు పనికివస్తావు!" అందికదూ ఆ రోజు ! ఎంత చులకన !

ఆ ఒక్కమాట తనలో ఎంత మార్పు తెచ్చింది.!

*　　*　　*

తనకు ఇరవయి సంవత్సరాలు నిండాయి. ఎస్. ఎస్. ఎల్. సి. ప్యాసయ్యాడు. పని ఏమీ లేదు ... ఆ మాట కళ్యాణికి ఎంత చులకన !

కళ్యాణి అంటే తన కెంతో ఇది. తను మంచి ఉద్యోగం సంపాదించి, కళ్యాణిని పెండ్లి చేసుకోవాలి—



కాని అది నప్పుకోవాలి

నప్పుకుంటుంది! మంచి ఉద్యోగం ఉంటే! ఎమ్మేలు ఉద్యోగాలు లేక రోడ్లవెంట తిరుగుతూంటే, వట్టి 'ఎస్సెల్సీ' వాడికేం దొరుకుతాయి!

కళ్యాణి కండ్లముందే తాను నిరుద్యోగిలా తిరగాల్సివచ్చింది. ఒకరోజు తనే అన్నాడు :

"నేను మిలిటరీలో చేరుతాను" అని.

అప్పుడెంత నవ్వింది కళ్యాణి! ఆ నవ్వులు తూటాల్లాగా తన గుండెలోకి దిగాయి.

"పిరికివాడివి నీవు! నీ వెందుకు పనికివస్తావు!" అంది పగలబడి నవ్వుతూ.

ఎంత చులకన! హేళన! ఎంత అవమానం ....

అంతే—తర్వాత కళ్యాణిని చూడలేదు తను. రాత్రికి రాత్రే పట్నం పోయాడు.

మిలిటరీలో చేరిపోయాడు.

నాలుగేండ్లయింది. నాలుగేళ్లలోనూ చాలా నేర్చుకున్నాడు. మెట్రిక్ చదువువల్ల పెర్మనెంట్ కూడా కాగలిగాడు—గోవా—విముక్తిలో తాను పాల్గొన్నాడు. కాని, తను అనుకోలేదు, ఇలా, ఇక్కడికి వచ్చి యుద్ధం చేయాల్సివస్తుందని.

ఎక్కడి ఆంధ్రదేశం ....

ఎక్కడి మహోన్నత హిమాలయాలు ....

నన్నని సిల్కు లాల్చీ లెక్కడ? ఆకుచెప్పులెక్కడ? మూడంగుళాల దూది పరుపులాంటి కోట్లూ, మూడంగుళాల ఎత్తు మిలిటరీ బూట్లు ఎక్కడ?

అది స్వర్గం—ఇది అధఃపాతాళం ....

కానీ ఇందులోనే ఉంది స్వర్గం—వీరస్వర్గం....

తల తిరిగిపోతూంది.....

మెషిన్‌గన్‌లా మనస్సులోకి ఆలోచనలు తగులుతున్నాయి. తను ఏదైనా సరే సాధించాలి ....

కళ్యాణికి తన ధైర్యంచూపాలి; అది మాట ఉపసంహరించుకోవాలి .... సమయం ఆసన్నమైంది కూడా.

* * *

"భాయీ, అటువేపు చూడు" అన్నాడు నాయర్ హుషారుగా.

'అటువేపు' అంటే ఒకటేవేపు.

ట్రెంచిలోంచి ఉత్తరంగా, దూరంగా ఉన్న పర్వతాల క్రీనీడ వైపు .... ఆ చిక్కని చీకట్లో ఏమి జరిగినా కన్పించదు, ...... ఎంతమంది నడిచినా ఎవరూ గమనించలేరు.

"భాయీ, నా కేదో శబ్దం వినిపిస్తూంది" అన్నాడు రాంసింగ్.

"ఎక్కణ్ణించి?" అన్నాడు రాజా.

అప్రయత్నంగా వేలు ట్రిగ్గర్ వద్దకు పోయింది.

"నీడలు కదూ .... అదే కొండ క్రింద.... "

జాగ్రత్తగా, వీలైనంత బాగా నక్షత్రాల కాంతిలో కండ్లు చిట్లించి చూచాడు రాజా.

దూరంగా ఏవో ఆకారాలు వస్తున్నాయి. జాగ్రత్తగా చూచాడు. చిన్న సమూహం .... దాదాపు పదిమంది—పదిహేను కాబోలు.

"భాయీ, చీనీ రాక్షసులు .... " అన్నాడు నాయర్.

అతని కంఠం ఆనందంతో వణికింది.

"సింగ్ భాయీ, పని పడింది" అన్నాడు రాజా.

"దగ్గరగా రానీ. ఇంకా ఎవరైనా ఉన్నారా వెనక?"

"కాస్సేపు ఆగు.... మన మిక్కడ ఉన్నట్లు తెలుసా వాళ్ళకి?"

"తెలీదనుకుంటాను."

"మనవేపే వస్తున్నారు. రేంజిల్‌లోకి బాగా రానీ. నాయర్! నీ యిష్టం."

క్షణాలు గడిచిపోసాగాయి. నాయర్ పొజిషన్‌లోకి తెచ్చుకున్నాడు ఆటోమాటిక్‌ని. రాంసింగ్ కుడి కన్ను చీకట్లో జరుగుతున్న సమూహంలోకి చూసింది రైఫిల్ మీదుగా.....

"భాయీ .... జైహింద్—"

"జైహింద్—"

ఒక్కసారి మూడు ఆటోమాటిక్ రైఫిళ్లూ నోళ్లు తెరిచాయి. వాటినుంచి విస్ఫులింగాలు చీకటిని ఛేదిస్తూ బయలుదేరి గుంపులోకి దూరాయి. బీభత్సమై గుంపు చెదరిపోయింది.

"భాయీ, వెళుతున్నారు .... " అన్నాడు నాయర్ సంతోషంతో.

రాజా ఆటోమాటిక్‌ని ఎత్తి ఎడమకూ, కుడికీ తిప్పుతూ పేల్చాడు. రివ్వున పైనుంచి పోయాయి తూటాలు.

రాజా బోర్లా పడుకున్నాడు. అవతల్నించి వా తుపాకులూ పేలుతున్నాయి రెండుచోట్ల మం దగ్గర దగ్గరగా.

"రాంసింగ్!.... నేను ఆవేపునుంచి వెళ్తున్నా అన్నాడు రాజా లేచి. మోకాళ్లమీదనుంచుని—

"జాగ్రత్త .... అక్కడున్నాయా?" అన్నా రాంసింగ్ .....

"జైహింద్—"

రాజా అలాగే మోచేతులమీదపాకుతుంటూ బయ దేరాడు. చేతిలో రైఫిల్ ఉంది. రాళ్ళుకాలోలు కా తగులుతున్నాయి

రాంసింగ్, నాయర్—ఇద్దరూ తుపాకులుక స్తూనే ఉన్నారు.... అవతల్నించీ అదేపనిగా తూట వర్షం పడుతూంది—

మరో పది గజాలు ....అంతే చాలు....అక్కడ్నుం ఒక్క గ్రెనేడ్— ఆ రెండువ్యుత్యుముఖాలూ న అయిపోతాయి.

రాజా అలాగే పాకుతుంటూ పోసాగాడు చేతు కొంకర్లు పోతున్నా; గుండెలదగ్గరమంటగా ఉంది. మరో కొంచెం...చాలు ....

ఆగి వూపిరి పీల్చుకున్నాడు. కుతనక్కడు శ్ర వుల మెషిన్‌గన్ చప్పుడు స్పష్టంగా విన తూంది. అందులోంచిమెరుస్తూ చీకట్లోకితూటా ప్రవహిస్తున్నాయిఆగకుండా ....

తను ఉన్న ట్రెంచి వేపు చూచాడు రాజా. మధ్య మధ్య రాంసింగ్, నాయర్ల తుపాకు సమాధానాలు పలుకుతున్నాయి.

బెల్టుకు తగిల్చిన చేతిబాంబు తీశాడు రా తడుముతూ .... రెండవది సిద్ధంగా ఉంచుకున్నాడ రైఫిల్ సెబిషన్ మెషిన్‌గన్‌లకు గురిగా ఉం కున్నాడు.

బాగా వూపిరి పీల్చుకున్నాడు. గ్రెనేడ్ పిన్ను నోటితో లాగేశాడు.

ఒకటి—రెండు—మూడు—నాలుగు— అయిద —ఒక్క వూపుతో చేత్తో విసిరివేశాడు. ధ్రా మెషిన్‌గన్ వేపు .... వెంటనే మరోటి—ఒకటి— రెండు—పెద్ద ప్రేలుడు!

చిన్న ఉత్పాదంలాంటి వెలుతురు—చప్పుడూ... మెషిన్‌గన్నులు రెండూ ఆగిపోయాయి. చేతిలో రైఫిల్ తీసుకున్నాడు; నొక్కాడు. చీకట్లో మృత్యువును పంపాడు.

శత్రుశేషం ఉండకూడదు.

ఫటుఫట లాడింది రైఫిలు.

కాస్సేపు ఆగాడు.... రాంసింగ్, నాయర్ల రైఫిళ్ళు నిశ్శబ్దంగా వున్నాయి.. అదే సంకేతం తనకు.. అవతలివైపునుంచీ శబ్దంలేదు.. కాస్సేపు ఆగి, వచ్చిన త్రోవ జ్ఞప్తిచేసుకుంటూ బయలు దేరాడు.. పదినిముషాలయింది ట్రెంచిలోకి వచ్చి పడేసరికి....రైఫిలు వేడిగా వుంది— చేయి— చల్లగా....

"రాజా భయ్యా...మంచిపనిచేశావ్" అన్నాడు నాయర్..

"మీరిద్దరూ క్షేమమా?" అన్నాడు రాజా వూపిరిపీల్చుకుంటూ....

45—వ పేజీ చూడండి




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**22-2-1963 శుక్రవారము మొదలు**
**28-2-1963 గురువారము వరకు**

### గ్రహ స్థితి

కర్కాటకంలో అంగారక రాహువులు; ధనుర్మకరాలలో శుక్రుడు; మకరంలో బుధ శని కేతువులు; కుంభంలో సూర్య గురువులు; మకర కుంభ మీన మేషాలలో చంద్రుడు.

## మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

కొన్ని సందర్భాలలో ధైర్య సాహసాలతో ఇతరులను ఆకర్షించ గలుగుతారు. తలచిన పనిని క్రమ పద్ధతిలో ఇతరులకు బాధ లేకుండా సాధించుకొన గలుగుతారు. ఆదాయం అధికంగా వచ్చి, ఖర్చు అవుతుంది. చాలాకాలం నుంచి తీరని బాధ్యతలు ఈ సమయంలో చల్లగా నెరవేరుతవి. ముందు కొంత సందేహం కలిగినా, సమయంలో ఇతరులను నమ్మి చిన్న చిన్న దండగలను భరించవలసివస్తుంది. పెద్ద మనుష్యుల పరిచయం లభిస్తుంది. వారం రెండవ భాగంలో లాభవార్తలు వింటారు. కుటుంబంలోనివారి ఆరోగ్యాన్ని గురించిన చింత కలుగుతుంది. ప్రస్తుతం ప్రయాణాలు తృప్తికరంగా జరుగవు. 23, 24 తేదులలో సుఖభంగం, స్వల్ప ఫలితం.

*　　*　　*

## వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఈ వారం పనిని మించిన హడావుడి, ఆడంబరము కనుపిస్తూ ఉంటవి. అధికారుల సహవాసం చేస్తారు. ఇంతకుముందు జరుగలేదనుకొంటున్న వ్యవహారాలు మీకు అనుకూలమైన స్థితికి చేరుతవి. ఆదాయం బాగుంటుంది. ఒక్కొక్క సమయంలో అకస్మాత్తుగా ఉద్రేకం కలుగుతుంది. కాని, దైవానుగ్రహంవల్ల పరిస్థితులు గ్రహించుకొని నిగ్రహించుకొన గలుగుతారు. ప్రయాణాలు చేస్తారు. వినోద కార్య క్రమాలలో పాల్గొంటారు. మీనుంచి సహాయం ఎదురుచూచేవారిని సమాధాన పరచటం శ్రమగా తోస్తుంది. రాజకీయాలు మొదలైన పనులలో కార్యభారం వహించవలసిన సమయం. వారాంతంలో మీ ఆరోగ్యాన్ని గురించి జాగ్రత్తగా ఉండండి. 25, 26 తేదులలో ధనప్రాప్తి, ప్రయాణం.

*　　*　　*

## మిథునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఈ సమయంలో మీ అంతస్తును కాపాడుకొనటం నిమిత్తం రకరకాల వ్యాసంగాలలో పాల్గొంటారు. ఉత్సాహం బాగుంటుంది. ఎదటివారి మాటను త్రోసిపుచ్చటానికి మనస్సులో బాధపడతారు. కాని ప్రస్తుతం తప్పనిసరి అవుతుంది. ఒకప్రక్క బాధపడుతూ, మరొకప్రక్క గొప్పదనమని అని



పించుకునే పనులలో ప్రవేశించవద్దు. వారం మధ్యలో కష్టవార్తలు తెలియగలవు. సంస్థ కార్యాలు నిదానంగా జరుగుతవి. స్వంత వృత్తికి సంబంధించిన పనులలో తరచు ప్రతిబంధకాలను ఎదుర్కొంటూ మామూలు నడకకు భంగం రాకుండా చూచుకొంటారు. కార్యభారంకన్నా 'ఆందోళన' అధికంగా ఉంటుంది. 26, 27 తేదులలో బాహ్య గౌరవం, వృత్తిలో క్రొత్త అవకాశాలు.

*　　*　　*

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

మీ శక్తినీ, ప్రస్తుత మున్నటువంటి అవకాశాలను క్రమపద్ధతిలో వినియోగించుకుంటారు. అకస్మాత్తుగా వచ్చే మార్పులు ఆశ్చర్యంగా తోచవచ్చు. ముందు ముందు ఏదో లభిస్తుందనే భావం కన్నా, ఎప్పటికప్పుడు చేతికందిన దానిని వినియోగించుకొనటమే మంచిది. పిల్లల ఆరోగ్యం బాగుండదు. ఇతరులకు సలహా చెప్పటంతోపాటు భారం కూడా వహించవలసివస్తుంది. వృత్తి వ్యాపారాలలో మీ జాగ్రత్తవల్ల నష్ట, కష్ట సూచనలు తొలగుతవి. ఎదటివారి మనోభావాలను గ్రహించుకొంటారు. పెద్ద మొత్తాలు ధనం వినియోగించతగిన పనులకు పోవద్దు. మీ వ్రాతలలో పొరపాట్లు దొర్లకుండా చూచుకొనండి. ఎదురు చూస్తున్న వార్తలు వెంటనే అందవు. అధైర్యం అనేది తోచదు.

*　　*　　*

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

నిదానంగా యోచించినకొద్దీ ఒక్కొక్క కొత్త విషయం తెలుస్తూ ఉంటుంది. దాదాపుగా మీకు సాధ్యంకానిది అంటూ ఉండదు. అయితే పదిమందీ పోయే దారిని తప్పటానికి వీలుకాదు. ప్రస్తుతము ఇది ఒక సమస్య. ఆదాయం మామూలుగా ఉంటుంది. ఒకరిని బాధించకుండా మీ గౌరవాన్ని కాపాడుకొంటారు. కుటుంబంలో పుణ్యకార్యాలు నిరాటంకంగా జరుగుతవి. "అతి వినయం ధూర్త లక్షణం" అనే నినయం మనసులో పెట్టుకుని మోసం

### ఈ వారము ధరలు

బంగారు ధర ఈ వారం కొంత మందీ వచ్చి నిలుస్తుంది. వెండి ధర తాత్కాలికమైన తేజీ వస్తుంది. నూలు ధర పెరుగుతుంది. వేరుశెనగపప్పు ధర తరచు హెచ్చు తగ్గులు వస్తున్నా, వారాంతంలో తేజీలో నిలుస్తుంది. మూవుల ధరలో కొద్ది మందీ. మిర్చి ధర ఈ వారంలో మందీ రాగల సూచన లున్నవి.

జరుగకుండా చూచుకొనండి. సంఘంలో పేరూ, పలుకుబడీ వృద్ధి అవుతవి. పిల్లల మూలంగా సంతోష, సుఖాలు లభిస్తవి. విద్యార్థులకు ప్రోత్సాహకరంగా ఉంటుంది. 27, 28 తేదులలో సంతోష వార్తలు, బంధుమిత్రులవలన గౌరవం, త్రిప్పట.

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)**

ఆర్థికంగా మేలు పొందగలుగుతారు. మీ మాట ప్రకారం కార్యం చక్కబెట్టుకొని రాగల స్నేహితులు దొరుకుతారు. పై అధికారులతో మితంగా మాట్లాడుతూ స్నేహాన్ని నిలబెట్టుకుంటారు. కుటుంబంలోని కొరతలు క్రమంగా పరిపూర్తి కాగలవు. వృత్తి ఉద్యోగాలలో మీ స్థితి పెరిగే అవకాశా లున్నవి. పని మాత్రం కఠినంగా కనుపిస్తుంది. మీ మాటలోని మృదుత్వాన్ని ఎదుటివారు అపార్థం చేసుకొని మీపైన స్వారి చేయటానికి చూస్తారు. ముందు జాగ్రత్త అవసరం, వ్యాయం మీ పక్షంలో ఉండటంవల్ల, వ్యవహార రంగంలో విజయం పొందగలుగుతారు. ప్రయాణాలు సంతోషంగా జరుగుతవి. వారాంతంలో విచారకరమైన వార్తలు తెలుస్తవి.

*　　*　　*

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మీకు ఈ సమయం అన్ని విధాలా అనుకూలమైనది. పదిమందిలో గౌరవం, అధికారం, మాటచలామణి—అన్నీ బాగుంటవి. అవివేకంతో మాట్లాడేవారు కొన్ని సమయాలలో తటస్థపడతారు. అందువల్ల మీకు వచ్చే లోపం ఏమీ ఉండదు. కుటుంబంలోనివారికి తరచు ఆరోగ్యభంగం సూచిస్తూ ఉంటుంది. బాహ్య కార్యకలాపాలు యథాప్రకారం సాగుతూ ఉంటవి. శ్రమపడి సమయంలో సంతృప్తికరంగా ఫలితం పొందగలుగుతారు. పనుల వృత్తిడిలో వేళకు తగిన నిద్ర, ఆహారము లభించకపోవచ్చు. మనోధైర్యం మిమ్ములను కాపాడుతుంది. ఉన్నత స్థితియందున్నవారి స్నేహం లభిస్తుంది. వృత్తిలో మీ స్థితి పెరుగుతుంది. వారం రెండవ భాగంలో ప్రయాణావకాశాలున్నవి. 22,23 తేదులలో చికాకు కలిగే సంఘటనలు, శ్రమ.

*　　*　　*

## వృశ్చికం:

(విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

గొడవపడి పిల్లి పోటు—మనుష్యులతో మీ సమస్యలు, ఆందోళన మరికొంత పెరిగే అవకాశాలున్నవి. మీరు ప్రయత్నించినకొద్దీ పనులు వెనుకకు పోతూ ఉంటవి. ఓర్పుతో కాలక్షేపం చేయండి. వ్యవహార దోరణిలో మాట్లాడే మనుష్యులతో సంబంధం తగ్గించుకోవటం అవసరం. దుబారా ఖర్చులు కొంతవరకు తగ్గుతవి. మనస్సుకు పని కల్పించకుండా నిగ్రహించుకోవటం అవసరం. క్రొత్త వృత్తులలో ప్రవేశించే అవకాశాలున్నవి. మీ క్రింద పనిచేయు మనుష్యులతో వాద ప్రతివాదాలకు చోటు లేకుండా చూడండి. తాత్కాలికంగా మీ ఆరోగ్యంలో మార్పు కనిపిస్తుంది. 26, 27 తేదులలో శుభవార్తలు.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఎప్పటికప్పుడు పరిస్థితులు మార్పు చెందటం వల్ల అనుసరించవలసిన మార్గం నిశ్చయించుకోనలేక పోతారు. కుటుంబములో పరస్పర సహాయము అనేది లోపించే అవకాశాలున్నవి. మనస్సులో ఆయాసం అధికమవుతుంది. వృత్తిలో పెట్టుబడి పెట్టటం వంటి భారాలు పెరుగుతవి. ఏదో ఒక విధంగా ధైర్యం చేయక తప్పదు. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. గాలి వార్తలను నమ్మి క్రొత్త ప్రయత్నాలు ఆరంభించినప్పుడు శుభకార్యాలు చురుకుగా జరగటానికి అవకాశాలు లభిస్తవి. మీ వృత్తి ఉద్యోగాలలో మాటరాకుండా కాపాడుకుంటారు. వారాంతంలో శుభవార్తలు వింటారు. స్నేహితుల కార్యభారం అధికం. 24, 25 తేదులలో నిరుత్సాహం. చిన్న చిన్న పేచీలు.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా., శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

ఈ వారం మానసికంగా నిలకడ లోపిస్తుంది. వృత్తిలో మీరు జాగ్రత్తగా మసలుకుంటారు. కాని, ప్రశాంతంగా ఉండటానికి అవకాశం ఉండదు. ముందు ఆశ కనిపించటం, తీరా ప్రయత్నిస్తే ఫలితం లేకుండా పోవటం జరుగుతూ ఉంటుంది. మొత్తంమీద సమయంలో ధన సహాయం లభిస్తుంది. బంధుమిత్రులవల్ల మంచిమాట, ఆదరము లభిస్తవి. దైవానుగ్రహంవల్ల ఇతరుల నిమిత్తం చేసిన పనులు త్వరగా అనుకూలిస్తవి. శారీరకంగా అలసట, ఉష్ణసంబంధమైన బాధలు వస్తూ ఉంటవి. వ్యవహారాలకుకూడా ఒక సమయంలో ఆటంకం రాగల అవకాశాలున్నవి. పదిమందిలో మీ అభిప్రాయాన్ని నిష్కర్షగా తెలుపగలుగుతారు. ఖర్చులు అధికం.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా., శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా.)

చాలావరకు మీ పరిస్థితులు బాగావుంటవి. ఎక్కడకు వెళ్ళినా మంచి పేరు, గౌరవము లభిస్తవి. ఏ విషయంలోనైనా ప్రశాంతంగా పనులు జరుపుకొంటారు. పట్టుదలతో పదిమందికీ సహాయం చేయగల అవకాశాలు లభిస్తవి. మీ వృత్తిలో కూడా ఫలితం బాగుంటుంది. విలువ తెలియని పనులలో ప్రవేశించవద్దు. స్థిరాస్తులు కొనటం వంటి సందర్భాలలో శక్తిని మించిన భారం పైన వేసుకుని అవస్థపడవలసి వస్తుంది. ముందు జాగ్రత్త అవసరం. జీర్ణకోశాలలో నరములయందు బాధ కనిపిస్తుంది. ఒప్పుకున్న పనులను సకాలంలో నెరవేర్చలేక పోతారు. ప్రయత్నించటం అవసరం.

* * *

## మీనం:

(పూర్వాభాద్ర 4 పా., ఉ. భాద్ర, రేవతి.)

వృత్తిలో శ్రమ పెరుగుతుందే కాని, ఫలితం పెరగదు. మాటల గౌరవం బాగుంటుంది. మనో నిబ్బరం అవసరం. కుటుంబంలో అనుకూలమైన సమయం. స్థిరాస్తులమూలంగా ఆదాయం లభిస్తుంది. విలువగల వస్తువులు కొంటారు. మీ ఆరోగ్యము, కుటుంబంలోనివారి ఆరోగ్యము బాగుంటుంది. ఎదురు చూస్తున్న శుభవార్తలు తెలుస్తవి. విద్యార్థులకు ఎక్కువ ప్రోత్సాహకరమైన కాలం. మానసికంగా ఉన్న సమస్యలు, సంకోచాలు తీరిపోతవి. వృత్తి ఉద్యోగాలలో క్రొత్త వ్యక్తులను కలుసుకొంటారు. అయితే పై అధికారుల వల్ల మాట వస్తుందేమోనన్న భావం మాత్రం మీ మనస్సును వేధిస్తూ ఉంటుంది. 27, 28, తేదులలో సంఘంలో గౌరవం, ఇష్టవస్తులాభం.

★















[ఇది కేవలం ఒక కథేనని మీరు అనుకుంటే పొర బాటు పడతారు. ఒక చిన్న సన్నివేశం—సినిమా కథకు ఎలా నాంది అవుతుంది—మామూలు కథకు ఎలా నాంది అవుతుంది.... అవి వాస్తవికతకు ఎంత దూరం అని ఆలోచించగా ఇలా ఉండటానికి అవకాశం లేకపోలేదు అన్పించింది—ఇది కేవలం నా ఊహ మాత్రమే.]

సన్నివేశం—ఒక అమ్మాయిని—ఒక అబ్బాయి 'డేష్' ఇస్తాడు.

ఈ సన్నివేశంతో కథ:—కథ పేరు: 'పశ్చాత్తాపం'

ఆరోజు పార్కులో జనం ఆట్టే లేరు. అలా అని నిర్మానుష్యంగానూ లేదు. శేఖర్, మరో ఇద్దరు ముగ్గురు స్నేహితులూ— ఓ బెంచిమీద కూర్చుని ఏవో ఏవేవో విషయాలు చర్చిస్తున్నారు. శేఖర్ 'బియ్యస్సి ఫైనల్ ఇయర్' చదువుతున్నాడు. బుద్ధిమంతుడు క్రింద జమ. అమ్మాయిలను ఏడిపించడం అంటే అసహ్యం .... దాంతో స్నేహితులందరూ 'శేఖర్'ని ధైర్యం లేనివాడిలా — మాట్లాడుతూ ఉంటారు—శేఖర్‌కి అమ్మాయిలను ఏడిపించటం ఇష్టం లేకపోయినా, స్నేహితుల హేళన భరించ లేక .... "పందెం—ఏం చెయ్యమంటారూ !?" అన్నాడు.

ఓ నిముషం ఆలోచించారు ఆ ఇద్దరు స్నేహితులూనూ—అంతలో:

"దూరంగా చూశావా ?—సురేఖా .... పద్మ వస్తున్నారు ... సురేఖను డేష్ ఇవ్వాలి ...." అన్నాడు గోపాలం.

"ఛా ! అదేం పందెం !— మరేదైనా పందెం" అన్నాడు శేఖర్; ఆ పని చెయ్యడం ఇష్టంలేదన్న ట్టుగా.

"నేను చెప్పలేదూ—మనవాడికి దమ్ముల్లేవురా... ఓ అయిదు రూపాయలు పందెం కాయి—నేను డేష్ యిస్తాను—" అన్నాడు మూర్తి.

హి ! హి అంటూ గోపాలం, మూర్తి గట్టిగా నవ్వేశారు.

శేఖర్ లేచి నిలుచున్నాడు "అయితే చూడండి" అంటూ నడిచాడు.

గోపాలం, మూర్తి ఒకర్నొకరు చూసుకున్నారు.

సరిగ్గా అదే సమయానికి సురేఖా, పద్మా అక్కడకు వచ్చారు.

గబగబ నడుస్తున్నట్టుగా వచ్చి సురేఖను తగులుతూ, నడిచివెళ్ళిపోయాడు శేఖర్ ప్రాణా లుగ్గబట్టుకుని.

శేఖర్‌వైపు కొరకొర చూస్తూ "శొంఠి వెధవలు—సిగ్గు లేకపోతే సరి; కాస్త ముందూ వెనుకా చూసి నడుస్తే ఏం పోయిందో ?" అంది పద్మ సురేఖకు జరిగిన అవమానానికి ఆమెను ఓదారుస్తున్నట్టుగా.

శేఖర్ చిన్నబుచ్చుకున్నాడు—అయినా అది పైకి కనుపించనీయకుండా తనను దూరంనుంచి కనిపెడుతున్న మిత్రుల దగ్గరకు వెళ్ళి, "ఇవ్వండ్రా అయిదు రూపాయిలూనూ .... పందెం వేశారుగా, పందెం !!" అన్నాడు.

"ఏడిశావ్ .... అయిదు రూపాయలు పందెం అన్నాం కాని, నీకు ఇస్తామన్నా మేమిటి ? కావాలంటే సినిమాకు తీసుకువెడతాం పద."

శేఖర్—మిత్రులూ సినిమాకు బయలుదేరారు.

సినిమా జోరుగా సాగిపోతోంది. తారు రోడ్డు మీద 'ప్లిమత్' కారులా పరుగు పెడుతోంది కథ—సినిమాలో హీరో ఓ అమ్మాయిని అవమానిస్తాడు మిత్రులతో పందెం వేసి—ఆ అమ్మాయి అనుభవించిన బాధ చూసి శేఖర్ కన్నీరు కార్చాడు. పాపం! సురేఖ ఎంత బాధపడిందో !!? తలుచుకుని చాలా బాధపడ్డాడు—అయితే తను పడ్డ బాధ పైకి తెలియనీయలేదు శేఖర్. మంచివా డనుకుంటూన్న శేఖర్, తను చేసిన చిన్న తప్పు—పనికి తనలో తానే చెప్పలేనంత బాధపడ్డాడు ......

మర్నాడు శేఖర్ ఒక్కడూ రోడ్డంపట నడుస్తున్నాడు. సురేఖ ఎదురుగా వస్తోంది—సురేఖ తనవైపు కోపంగా చూసి వెళ్ళిపోయింది. అంతక్రితం రోడ్డుమీద ఎప్పుడైనా కన్పిస్తే "మిమ్మల్ని కాలేజీలో రోజూ చూస్తున్నాను" అన్నట్టు చూసేది. అయితే ఇప్పటి చూపు వేరు.

ఆమె చూపులు చూసి "ప్రిన్సిపాలుతో రిపోర్టు చేస్తుందేమో !" అనుకున్నాడు శేఖర్. "అమ్మో ! ప్రిన్సిపాల్‌కు రిపోర్టు ఇస్తే టి. సి. ఇచ్చేస్తాడేమో !?" శేఖర్ గజగజ వణికిపోయాడు. అమాంతం సురేఖ దగ్గరకు వెళ్ళి "నన్ను క్షమించండి" అందామనుకున్నాడు. అయితే ఆమె దగ్గరకు వెళ్ళలేక పోయాడు. ఆరోజు రోజంతా కాలేజీలో ఏ నిముషం ప్రిన్సిపాలు కబురు పెడతాడో అనే భయంతోనే గడిపివేశాడు. అయితే అటువంటిదేమీ జరుగలేదు. సురేఖను మనసులోనే పలువిధాల అభినందించుకున్నాడు. మిత్రులను ప్రతిమాలుకుని ఆ విషయం ఆట్టే అంత ప్రచారంలోకి రాకుండా ఏర్పాటు చేసుకున్నాడు.

* * *

ఇంటర్—కాలేజీ—క్రికెట్ మ్యాచిలు జోరుగా సాగిపోతున్నాయి. ఎదుటి టీములో "ఆనంద్" కనుపించేటప్పటికి శేఖర్ ఎగిరి గంతు వేశాడు. ఆనంద్ దగ్గరకు వెళ్ళి "ఏరా ! మీ కాలేజీ టీముతోపాటు నువ్వు వస్తున్నావని వ్రాస్తే, స్టేషనుకి వచ్చి మా ఇంటికి తీసుకెళ్ళేవాడినిగా ! అయినా వస్తున్నట్టుగా ఓకార్డు ముక్కయినా వ్రాసి పడేస్తే ఏం పోయింది చెప్పు!?" అన్నాడు.

"ముందర వ్రాద్దామనే అనుకున్నాను .... అయితే నీకు నేను వస్తున్నట్టు తెలియకుండా రావాలనిపించింది .... అందుకు వ్రాయలేదు....."

"అయితే పిల్లందరితోపాటు హాస్టల్లో దిగావా !?"

"లేదురా ! ఈ సంవత్సరం మొదట్లో మా బాబాయిగారికి ఈ ఊరు ట్రాన్స్‌ఫర్ అయింది...

వాళ్ళింట్లో దిగకపోతే మా చెల్లెలు చంపేస్తుంది. అందుకని అక్కడే దిగాను."

ఆరోజు మ్యాచి అయిపోయింది. అనేకమంది శేఖర్‌ని అభినందించారు — వంద పరుగులు సాధించి నందుకు. వాళ్ళతో కాస్సేపు కబుర్లు చెప్పి ఆనంద్, శేఖర్ బయటపడ్డారు.

ఆనంద్, శేఖర్ ఒకే హైస్కూల్‌లో చదువుకున్నారు. అయితే శేఖర్ తండ్రికి ఆ ఊరు ట్రాన్స్‌ఫర్ అవ్వడంతో శేఖర్ ఆ ఊళ్ళో కాలేజీలో చేరాడు. శేఖర్‌కి ఆనంద్ దగ్గరకాని, ఆనంద్‌కు శేఖర్ దగ్గర కాని అసలు రహస్యం అన్నది లేదు. ఏ చిన్న విషయం జరిగినా చెప్పుకునేవారు ఇద్దరూనూ.

శేఖర్ తను చేసిన తప్పును ఆనంద్‌తో చెప్పకుండా ఉండలేకపోయాడు. "అంతా మా ఫ్రెండ్స్ నేను ఎంత బాధపడుతున్నానో. ఇంతవరకూ అయితే ఆ అమ్మాయి ప్రిన్సిపాలుకు రిపోర్టు ఇవ్వలేదు. ఎప్పుడేం జరుగుతుందోనని భయంగా ఉంది."

"పోనీ అలాగే చేద్దాం. ఇంతకూ ఎవరురా ఆ అమ్మాయి ?"

"సురేఖ అని ఫస్టు ఇయర్ చదువుతోంది. ఈ సంవత్సరమే కాలేజీలో చేరింది."

సురేఖ పేరు వినగానే ఆనంద్ కొంచెం ఉలిక్కిపడి వెంటనే సర్దుకుని "బట్టలు మార్చుకుని మా ఇంటికి రా—సురేఖను కలుసుకుందాం...."

"నాకు సురేఖ ఇల్లు తెలీదు ! ఏం చేద్దాం ?" అన్నాడు శేఖర్.

"మా చెల్లెలికి తెలిసే ఉంటుంది కనుక్కుందాం లే—మా ఇంటి అడ్రస్సు" అంటూ తను ఉంటూన్న ఇంటి అడ్రసు ఇచ్చి వెళ్ళిపోయాడు చెప్పాలో అర్థంకాలేదు సురేఖకు.

"ఊఁ" అని, ఎలాగా 'ఎలా తెలుసు అంటాడు' అనుకుని "కాలేజీమంచి ఇంటర్ — యూనివర్సిటీ క్రికెట్‌కు సెలక్టు అయ్యాడు — కాలేజీలో చాలా ప్రైజులు అతనికి వస్తాయట. ఇంచుమించుగా అమ్మాయిలు అందరికీ తెలుసు" అంది.

"చాలా మంచివాడిలా కనుపిస్తాడు .... " అన్నాడు ఆనంద్.

"మా కాలేజీ అమ్మాయిలు కూడా చాలామంది అలాగే అంటారు—అయితే నాకు మాత్రం ఏమో! ? ముందర నేనూ మంచివాడనే అనుకున్నాను. అయితే నిజస్వరూపం వేరుగా ఉండేటట్టుంది..."

ఆనంద్‌కి సంగతి అర్థం అయింది .... అతను అనుకున్నది రూఢీ అయింది.

"అదికాదే, ఒక్కొక్కప్పుడు ఏదో తప్పు చేశాడని



గోల చెయ్యడం వల్లనే జరిగిందిరా .... ఇప్పటికీ తలుచుకుంటే బాధగానే ఉంటుంది. పాపం, ఆ అమ్మాయి ఎంత బాధపడిందో ? వెళ్ళి క్షమాపణ చెప్పుకోవాలని ఉందిరా" అన్నాడు చెప్పడం పూర్తిచేసి.

శేఖర్ ఎటువంటివాడో ఆనంద్‌కు బాగా తెలుసు. అటువంటి శేఖర్ అలా చేశాడంటే నమ్మలేకపోయాడు.

"పోన్లేరా ! ఆవేశంతో ఏదో చేశావు. మర్చిపో. పశ్చాత్తాపం కంటె ఇక వేరే శిక్ష అక్కర్లేదు. ఇకముందైనా జాగ్రత్తగా ఉండు. ఆవేశంతో ఏదో చేసి అనక పశ్చాత్తాప పడటం కూడా మంచిదికాదు." ఆనంద్ అన్నాడు.

"సరేనా ! ఆ అమ్మాయిని కలుసుకుని చెప్పాలి ఆనంద్.

ఆనంద్ ఇంటికి వచ్చి చెల్లెలితో కబుర్లు చెబుతూ కూర్చున్నాడు.

"క్రికెట్‌మ్యాచి ఎలా ఉందే — నేను వచ్చేదాకా ఆగలేదేం !?"

"చాలామంది కలిసి వచ్చాం — నువ్వు వచ్చేటప్పటికి ఎలాగా ఆలశ్యం అవుతుందని ఆట అవగానే వచ్చేశాను వాళ్ళతో కలిసి."

"మీ కాలేజీ బాటింగ్ ఎలా ఉంది ? ఆ శేఖర్ లేకపోతే మీ టీమ్ నలభై రన్సుకే అవుటు అయ్యుండేవారు."

"అవును .... "

"శేఖర్ నీకు తెలుసునా ?"

అనుకోకుండా వచ్చిన ప్రశ్నకు ఎలా జవాబు ....—పార్కులో—అటువంటి నిర్ణయానికి వస్తే ఎలాగా—అతను లోపల ఎంత బాధపడుతున్నాడో. అసలు ఎవరో స్నేహితుల ప్రోద్బలంమీద అలా చేసి ఉండవచ్చుగా" అన్నాడు ఆనంద్.

సురేఖకు మతి పోయినంత పనయ్యింది.

చివరకు తట్టుకుని, పార్కులో జరిగిన విషయం నీ కెలా తెలుసు ? అన్నట్టుగా మొహం పెట్టి "నీ కెవరు చెప్పారు ఈ విషయం ? అయినా అంత బాధపడేవాడైతే వచ్చి "ఆపాలజీస్' చెప్పుకో వచ్చుగా ?" అంది సురేఖ.

"ఈ విషయం శేఖరే నాతో చెప్పాడు — శేఖర్

నాకు పది సంవత్సరాలు తెలుసు. వాడిని గురించి పూర్తిగా తెలుసు. ఎంతో బాధతో, జరిగిన విష యమంతా నాతో చెప్పి 'సురేఖను కలుసుకుని క్షమా పణ చెప్పుకోవాలిరా' అన్నాడు. వాడికి నువ్వు నాకు చెల్లెలివి అనే సంగతి తెలీదు. చాలా ఏంపిచాడే— ఎవరో చెప్పి చేయించారు పాపం! వాడు చాలా అమాయకుడు ....'' ఆనంద్ అన్న మాటలకు,

"అంతే నంటావా అన్నయ్యా — నేను ప్రిన్సి పాలుకు రిపోర్టు ఇద్దామనుకుంటే, మా ఫ్రెండ్స్ 'పోన్లే పాపం, ఇది అతనికి పుట్టిన బుద్ధి అయ్యుం డదు' అని మాన్పించేశారు — నేనూ పూరు కున్నాను.''

అంతలో "ఆనంద్'' అంటూ బయటనుంచి



కేక వినిపించింది. బయటకు వెళ్లిన ఆనంద్ శేఖర్‌తోపాటు తిరిగి వచ్చాడు.

సురేఖను చూడగానే శేఖర్ ఓ అర్థంలేని చూపు చూశాడు.

"ఇది సురేఖరా! మా చెల్లెలు— వీడు శేఖర్'' అంటూ ఒకర్నొకరికి పరిచయం చేశాడు ఆనంద్.

"ఐ ఆమ్ సారీ ఆనంద్. ఈమె మీ చెల్లెలు అని నాకు తెలీదు.''

"సురేఖ నా చెల్లెలు అని తెలిసిన తర్వాత నువ్వు బాధపడి ఉంటే అది కేవలం సురేఖ నా చెల్లెలు కాబట్టి అలా చేసినందుకు బాధపడుతున్నట్టు అవు తుంది. కాని నువ్వు ముందరే బాధపడ్డావు కదూ ?

# కత-సినిమా కత

అది నిజమైన పశ్చాత్తాపం ....''

"సురేఖా, మీరు నన్ను క్షమించాలి ....''

ఇంతకు మినహా ఏమీ చెప్పలేనట్టుగా ఆపేశాడు శేఖర్......

"పోన్లెండి. జరిగిందేదో జరిగిపోయింది. అన్నయ్య ఇప్పుడే చెప్పాడు సంగతి. అయినా మీరు అటువంటి వాళ్లతో తిరగడం ఏం బావుండలేదండీ'' అంది సురేఖ.

"జరిగినదాన్ని మర్చిపోరా శేఖర్ .... దాని మాట మర్చిపోదాం — సరే గాని, బ్రహ్మాండంగా సెంచరీ కొట్టావుగా — సినిమాకు వెడదాం పద. నేనూ సురేఖా ఎలాగా వెళదామనుకుంటున్నాం' అన్నాడు ఆనంద్.

"ప్రాక్టీసు రేపు కూడా ఉందిగా'' అన్నాడు శేఖర్.

"సెంచరీ కొట్టింది ఇవాళగా'' అంది సురేఖ.

"ఏమో .... కాని'' అని ఆగిపోయాడు శేఖర్.

"ఆహా ఏం! చెప్పు.''

"చెప్పడానికేం ఉందిరా !? ఇది నా పార్టీ .... అంతే.''

"ఎవరి పార్టీ అయితేనేం కాని, సినిమాకు లేట్ అవుతోంది నడువు.''

శేఖర్, ఆనంద్, సురేఖా సినిమాకు వెళి పోతారు.....

తరువాత సంగతులు ఎలా జరుగుతాయో సుల భంగానే ఊహించుకోవచ్చు. కథ ఓ అయిదు పేజీల పాటు సాగి చివరకు, "ఎంత మంచివారండీ మీరు.... ఆరోజు పార్కులో మిమ్మల్ని ఎంత చెడ్డవారనుకు న్నానో'' అంది సురేఖ....అని అంతమవుతుంది కథ.

అదే సన్నివేశం : సినిమా కథకు.

సినిమా పేరు: "పాము చేసిన సహాయం!''

సినిమా మొదలు పెట్టేసరికి....

.... బృందావనం సౌందర్యం తిలకిస్తూ, సోయ గాలు ఒలకబోస్తూ చేతులతో పుస్తకాలు పట్టు కుని ఓ లలనామణి నడుస్తూ ఉంటుంది. స్వర్గ లోకం నుంచి దిగివచ్చిన 'రంభ' అన్నట్టు (సినిమా హీరోయిన్—మీకూ నాకూ అర్థంచకపోవచ్చు) ఉంటుంది వేషం.

ఎదురుగా ఓ అబ్బాయి ఓ టెన్నిస్ బ్యాట్‌తో చేతుల్లో పుస్తకాలతో నడుస్తూ వస్తూంటాడు. ఇద్దరూ ఈ లోకంలో ఉండరు. ఊహాలోకాలలో విహరిస్తూంటారు. ఒళ్లు మర్చిపోయి నడుస్తూ గుద్దుకుంటారు. అమాంతంగా చేతుల్లో పుస్త కాలు కింద పడిపోతాయి. (బృందావనం సర్వ్యం మధ్యంగా ఉంటుందని వేరే చెప్పనక్కర్లేదు) పుస్త కాలలోంచి రెండు తెల్లటి కార్డులు కింద పడు తాయి. (ఒకరి పుస్తకాలలో నుంచి ఒక కార్డూ, మరొకరి పుస్తకాలలో నుంచి మరొక కార్డూ పడు తాయి.)

ఓ క్షణం ఒకర్నొకరు చూసుకుంటారు. అప్పుడు ఆ చూపులలో అదో రకమైన భావం

41-వ పేజీ చూడండి

నేను, నా స్నేహితుడు లక్ష్మణరావు క్లాసులో ఒకే బెంచిమీద కూర్చుని చదువుకున్నాము. అందుకే నేమో మా ఇద్దరి ఆశయాలు ఒక్కటైనయి. ఒకే ఆదర్శంతో మా ఇద్దరి మనస్సులు ఏకీభవించాయి. అప్పటికి మేమింకా కాలేజీలో చదువుతూనే వున్నాము. పొంగేపొంగే పాలలాంటిది మా వయస్సు. క్షణికోద్రేకంపాలు ఎక్కువగా వుంది మా రక్తంలో.

"జీవితం రాత్రిలాంటిది. సుఖం కలలాంటిది. అవునా?" అన్నాను ఒకరోజు సాయంత్రం వాడితో.

"అవును!" అన్నాడు వాడు తలూపుతూ.

"అందుకని కేవలం ఆ కలలాంటి సుఖాన్నాశించి మనం ఆదర్శాన్ని వదలుకోవద్దు." అన్నాను.

"అంటే ?" అన్నాడు వాడు అర్థంకానట్లు ముఖంపెట్టి.

"ఈ రోజుల్లో స్త్రీలకు ఎన్నో సమస్యలు వున్నాయి. ఇందులో ముఖ్యమైనది వివాహం. ఆర్థిక స్తోమతులేని వారింట్లో జన్మించిన కన్యల కలలు కలలుగానే మిగిలిపోతున్నాయి— కారణం మనకు తెలుసు—"

"ఏదైనా ఉపన్యాసమా ?" అన్నాడు నవ్వుతూ.

"వినరా బాబు! ఏం, అందువలన నే నీనాడు ఒక నిశ్చయానికి వచ్చేశాను." అన్నాను.

"ఏమిట్రోయ్ అది?" అన్నాడు వాడు సంభ్రమాశ్చర్యాలలో మునిగితేలుతూ.

"మరేం గాబరాపడకు. నేను అందవిహీనమైన చదువురాని పిల్లను కట్నం తీసుకోకుండా వివాహం చేసుకుంటాను. ఇది నా దృఢనిశ్చయం—" అన్నాను.

అప్పటికి అయిదు సంవత్సరాలక్రితం వెలువడిన ఈ మాటలు ఎంతో ఆత్మవిశ్వాసంతో అన్నవి.

లక్ష్మణరావు నవ్వాడు: "నిజంగానా ?" అన్నాడు.

"నిజం ! ముమ్మాటికి నిజం !" అన్నాను.

"అయితే నేనూ అంతే !" అన్నాడు వాడు.

ఒక రాత్రిపూట తన శరీరాన్ని తానే ఆహూతి చేసుకుంటూ వెలుగుతున్న క్రొవ్వొత్తిముందు నిల్చుని మే మిద్దరం ఇలా ప్రతిజ్ఞచేసుకున్నాం. మా ఈ ప్రతిజ్ఞలకు ఆ వెలుగుతున్న క్రొవ్వొత్తి మా మనస్సులుతప్ప మరి సాక్ష్యంలేదు.

మా ఆదర్శాలు కేవలం మాటలలో మాత్రం వ్యక్తంకాలేదు. చేతలలోకూడ మా శక్తికొద్దీ ప్రయత్నించి విజయం సాధించాము.

మామయ్య ఎన్నిసంబంధాలు తెచ్చినా తిరస్కరించేసరికి అమ్మ సందిగ్ధావస్థలోపడింది. మామయ్య, అమ్మ, బాబాయి నేను ఎవరినో ప్రేమించానని నిశ్చయానికి వచ్చారు. కాని మనోనిశ్చయం నిర్భయంగా చెప్పాను అమ్మతో. అమ్మ కీ విషయంలో పూర్తిస్వేచ్ఛ లేదని నాకు తెలుసు. ఒకవైపు మామయ్య మరోవైపు బాబాయి పోటీలుపడి సంబంధాలు తెచ్చారు. పిల్లలను వద్దన్నా వినక లాక్కుపోయి చూపించారు. పాపం! వారి జీవితాలతో చెలగాటమాడా నేమో ననిపిస్తుంది ఇప్పుడు తలుచుకుంటే. కృష్ణమూర్తి మామయ్యకూతురు పార్వతిని చేసుకుంటా నని చెప్పగానే ముందు ఆ కృష్ణమూర్తి మామయ్యే నోరుతెరిచాడు. ఏదో వూహించరాని వార్త విన్నట్లు, పిడుగు నెత్తిమీద పడ్డట్లు నిర్ఘాంతపోయి రాతి బొమ్మలా నిలబడిపోయాడు బాబాయి. అమ్మ మౌనాన్ని శరణు కోరి నిలబడింది.

ఇందుకూ కారణంవుంది.

పార్వతి అందమైనదికాదు. అలా అని మరీ కురూపికాదు.

మామయ్య ఏమంత కలవాడుకాదు. పెద్దకొడుకును బి. ఏ. కూడ అతికష్టంమీద చదివిస్తున్నాడు. ఇంకా ఇద్దరు మగపిల్లలు, అయిదుగురు ఆడపిల్లలు వున్నారు. ఇలాంటి మామయ్య కట్నమేమిస్తాడు ? అనే ప్రశ్న బాబాయి ముఖంలో తళుక్కున మెరిసింది.

కాని నా పట్టుదలముందు ఈ ప్రశ్నలు తృణప్రాయములైనాయి. నాతో పార్వతి వివాహం నిశ్చయమైంది.

కాని బాబాయికి ఈ వివాహం ఏ మాత్రం ఇష్టం లేదు. ఆయన శాయశక్తులా ఈ పెళ్లి నాపాలని చూశాడు. కాని మేమిద్దరం ప్రమాణంచేసిన ముహూర్త బలం అలాంటిది. దీన్ని ఆయన ఆపలేకపోయాడు. కాని, ఆయన ఒక విషయంలో విజయం సాధించాడు. అది నాలుగువేలు కట్నం. ఈ సంగతి ముందు నాకు తెలీదు. ఈ పెళ్లి సవ్యంగా జరుగుతుందని మామయ్య కూడ అనుకోలేదేమో. ప్రతిపనికి, ప్రతిచోటకి బాబాయి అడ్డువస్తూనే వున్నాడు. సణుక్కుంటూనే వున్నాడు. వీలైనంతవరకు బాబాయిని సర్దాలని ప్రయత్నించాము. కాని కోపోద్రేకంలో "అవునురా, ఈ నాటికి నేను పరాయివాణ్ణి అయ్యాను. ఆయన ఎక్కువైనాడు" అన్నాడు రెచ్చిపోతూ.

పెళ్లి ఏమంత ఉత్సాహంగా జరగలేదు.

కూతురు భవిష్యత్తుమీద మామయ్యకి భయంగా గానేవుంది. ఎండా వాన కలసిన ప్రకృతి ఆయనది. ఆయన జన్మలో వూహించనిస్థితి ఇది.

"బాబూ, ఎందరు లక్షాధికార్లు పిల్లనిస్తామని వచ్చినా మా అమ్మాయినెందుకు చేసుకున్నావో నాకే తెలీటంలేదు. కట్నంకూడా సమయానికివ్వ లేకపోయాను. త్వరలో సర్దుబాటు చేస్తాను." అన్నాడు. ఆయన గొంతులో దుఃఖం ఒలికింది.

నిర్ఘాంతపోయి నిలబడ్డాను. కాని దీన్నెవరూ గమనించలేదు. ఆ సమయంలో బాబాయితో వాగ్వ్యాదం ఇష్టంలేక వూరుకున్నాను.

పార్వతి నా సహధర్మచారిణి అయింది.

నా పెళ్లికి వారంరోజులముందు లక్ష్మణరావు మంజుల అనే అమ్మాయిని చేసుకున్నాడు. వాడూ ఈ విషయంలో నా ప్రక్కనే నిలబడ్డాడు.

కాని వాడికి నాకంటే మానసిక బలం ఎక్కువగా వుంది. ఈ పెళ్లివాళ్లింట్లో ఎవరూ ఆమోదించక పోయినా చేసుకున్నాడు. ఉద్యోగం దొరక్కుండావే కాపురం పెట్టేశాడు ! ఆ తరువాత ఉద్యోగం దొరికింది.

నే నదే చేయలేకపోయాను. పార్వతిని తీసుకురావటానికి, మరో పరిస్థితికి లంకిపెట్టి అమ్మనోరు నొక్కేశాడు బాబాయి.

అమ్మ మూగదైపోయింది.

నేను ఈ విషయం గురించి వ్రాస్తే "కాస్త ఓర్పు వహించు నాయనా, ఇంకో రెండేళ్లలోమురళి అమెరికానుంచి వస్తాడు. కమలని తీసుకుపోతాడు. ఇక నీ ఇష్టం ఎవ్వరూ కాదనరు. ఆయన కిష్టం లేని ఈ పని మనం చేస్తే ఏ పాపము ఎరుగని కమల కాపురం చెడుతుంది." అంటూ నాకు తిరిగి జాబు వ్రాసేది.

అమ్మ మనోవ్యథ అర్థంచేసుకున్నాను.

కాని రెండేళ్ళు గడిచి కమల మురళితో వెళ్లిపోయినా, పార్వతి మా ఇంటికి రాలేదంటే అందుకు కారణం నా బలహీనతే. ఈ రెండుసంవత్సరాలలోను నేను మారిపోయాను. బజార్లలో రెండుజడలు వేసుకుని, నైలాన్‌చీరలు కట్టుకుని భర్తవెంబడి విలాసంగా నడిచిపోయే ఏ స్త్రీని చూసినా నాలో ఈర్ష్య జనిస్తుంది. ఇది తప్పని తెలిసినా ఏమీ చేయలేక పోయాను. క్షణికోద్రేకంలో పార్వతిని పెళ్లిచేసుకున్నా. కాని లక్ష్మణుడికివి పట్టవు. వాడిసంసారం స్వర్గతుల్యంగా వుంది. ఈ మాటలు వాడే చెబుతాడు.

"బ్రదర్, మనకు కావలసింది ఆత్మ సౌందర్యం కాని, బాహ్య సౌందర్యంకాదు." అని హితబోధ చేసేవాడు.

నేనూ మాట్లాడేవాణ్ణికాదు.

"గుణంలోఉన్న రూపాన్ని చూచి ఎంతకాలం సంతోషిస్తామో, రూపంలోఉన్న గుణాన్ని చూచి అంతకాలం సంతోషించలేం." అనేవాడు.

నాకు నిజమేనేమో ననిపించేది.

"నువ్వెందుకింత బలహీనుడివి. హాయిగా సంసారం చేసుకోక ఏడిపిస్తున్నావు. అభముశుభము తెలియని పిల్లను ఏరికోరి చేసుకున్నావు. ఇంకా ఆమెలో ఏం తప్పుందని ఇలా ఏడిపిస్తావు? వెళ్ళి తీసుకురా, ఇల్లు చూస్తా" అన్నాడు.

అలాగే చేయాలనుకున్నాను. కాని మామయ్య సుగ్రీవాజ్ఞ. 'పార్వతి వచ్చిన మర్నాడు కమలవస్తుంది' అని ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరంలోని అక్షరాలు నా కాళ్ళకు బంధాలువేసినాయి.

నీరసంతో కూలిపోయాను.

* * *

అమ్మదగ్గరకెళ్లి చూసివచ్చాను.

గదంతా దుమ్ముధూళి పరిసర్పితమై ఉంది సీనుతో ఈ పాటికే రమ్మని చెప్పాను. ఇంకా రాలేదు.

అమ్మతో నా వేదన చెప్పుకున్నాను. కాని అమ్మ కూడ ఏమీ చేయలేని స్థితిలోవుంది. కన్నీరు కార్చి ఊరుకుంది. ఈ నిశ్శబ్దం నా తప్పుకు సంజాయిషీ చెప్పమంటోంది. కాని ఏం చెప్పను ? నాలోని వేదన పరాకాష్ఠ నందుకుంది. అర్థరహితమైన ఊహల సుడులు తిరిగి జీవన ప్రవంతిని హరించుకుపోతున్నాయి.

"బాబుగారు—"

"ఈ లోకంలోపడి కళ్ళుతెరచి చూశాను.

"ఏడుతున్నారేటి బాబుగారు ?" అన్నాడు వాడు కంగారుగా.

"ఏంలేదు సీను, గదిశుభ్రంచేయి" అన్నాను.

సీను నావంక చూస్తూ చీపురుతీసుకుని వెళ్ళాడు. జీవితం చలించే స్వభావంగల నీడలా అనిపిస్తుంది వెన్నెలలో చల్లగాలిలో నిండుగా వికసించిన గులాబీ పువ్వు ఎంత వెన్నెలని, ఎంత చల్లదనాన్ని పీల్చుకోగలదో, అంత ఆనందాన్ని పీల్చుకుంది జీవితం.

"బాబుగారు, ఉత్తరం—"

చింపి చదువుకున్నాను.

"ఏమండీ,

నా కెందు కీ శిక్ష ? నా గుండెల్లో భరించలేని బాధ పేరుకుపోతున్నది. మీరు నన్నెందుకిలా అవ

—36 వ పేజీ చూడుం




లక్మె ఫేస్ పౌడరు మీ చర్మపు సహజ సౌందర్యాన్ని ఇనుమడింప చేస్తుంది. మీ చర్మపు ఛాయతో, అద్భుతంగా, సున్నితంగా కలిసి పోతుంది. మీ వంటి రంగుకు అది తెచ్చే ఫలితాన్ని చూసి మీరు విస్మితులౌతారు. మూడు సైజులలో ... 6 ఛాయలలో ... నేచురల్, రేచెల్, గోల్డెన్ పీచ్, రోజ్ కోరల్, సన్‌టాన్, గ్లోయింగ్ యాంబర్.

# లక్మె

## ఫేస్ పౌడరు

# నవ్వులొలికే హంతకుడు : జాక్ హెన్రీ

ఈ నాటకానికి నాంది (పోలీసువారికి సంబంధించి సంతవరకూ) మధ్యరాత్రి తర్వాత ప్రారంభమయింది. అప్పటికే లండన్ పరిసరాలలో దీపాలు ఆర్పివేశారు. వీధులన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. ఆ రాత్రి—జూలై 14, 1938—జాన్ విలియం లస్ అనే ఫయిర్‌మన్ (Fireman) సోమర్‌సెట్ రోడ్ వెంబడే వెడుతూఉండగా అతని కారు హెడ్‌లయిట్‌ల కాంతిలో ఏదో రోడ్డుమీద పడి ఉన్నట్లు కనిపించింది.

ఆ చీకటిలో, అదొక గాలికి పడిపోయిన చెట్టు భాగమేదో అయిఉంటుందనిపించింది లస్‌కి. కాని, మరికొంచెం జాగ్రత్తగా చూడగా అదొక దేహం అని తెలిసింది.

వెంటనే బ్రేక్‌వేసి, దిగి చూశారు. తల బాగా చితికిపోయివున్న స్త్రీ శవం! ఫయిర్‌మన్ లస్ తిరిగి కారెక్కి పోలీస్ సహాయంకోసం బయలుదేరాడు. రెండువందల గజాలదూరం వెళ్ళాడో, లేదో రెండు పోలీసుకారులు కనిపించాయి. పక్కనే ఒక ఇంటిలో దొంగతనం జరిగితే శోధించటానికి వచ్చారుట. ఇద్దరు అధికారులను వెంట బెట్టుకుని శవం దొరికిన చోటికి వెళ్ళాడు లస్. వా రిద్దరిలో ఒకరు నాకు టెలిఫోన్ చేశాడు. నేను అంతకుముందే పడుకున్నాను కాని, ఈ వార్త వినగానే బయలుదేరాను.

నల్లని దుస్తులు ధరించిఉన్న ఆ స్త్రీ కళేబరం చూడగానే, ఇదేదో కారు 'ఏక్సిడెంట్'వల్ల జరిగిన హత్య అనిపించింది. తలమీద, ముఖంమీద గాయాలేకాక, కుడిపాదంమీద టయిర్ ముద్ర కూడా ఉంది.

ఆమెకు సంబంధించిన టోపీ గాని, చేతి సంచి గాని ఎక్కడా కనిపించలేదు. పాలిపోయినట్లున్న ఆమె ముఖ కవళికను చూస్తే దేహంలోని రక్తమంతా కోల్పోయి చనిపోయిందా అన్నట్లుంది. దీనినిబట్టి ఆమెను ఇంకెక్కడో అంతకుముందే హత్యచేసి, ఆ రోడ్‌మీదకు తీసుకువచ్చి ఏక్సిడెంటుగా కనిపించేందుకు మీదనుంచి బండీ నడిపి ఉండాలని ఊహించాను. తర్వాత తెలిసింది, హంతకుడు ఈ రక్తస్రావానికి సంబంధించిన వివరం సరిగ్గా గమనించలేదని.

పరిశోధనలో మొదట చెయ్యవలసిన పని మరణించిన వ్యక్తి ఎవరో తెలిసికొనటం. లండన్ మహానగరంలోని లక్షలాది జనులలో ఒక వ్యక్తి ఎవరని ఎలా తెలుసుకొనటం? ఆధారం ఏమీలేదు!

పోనీ పాత నేరస్థులేమో అని వేలి ముద్రలు తీసుకున్నాము. అంతేకాక, చుట్టుపట్ల ఉన్న ప్రతి కాఫీ హొటల్‌లోనూ, మోటార్‌వర్క్‌షాప్‌లోనూ రక్తపు మరకలతో కారు రావడం ఎవరయినా చూస్తే వెంటనే 'రిపోర్టు' ఇవ్వవలసినదని ప్రకటించాము. లండన్‌లో పోలీసులందరూ అటువంటి కారుకోసం వెతకటం ప్రారంభించారు.

అపరాధ పరిశోధన సక్రమంగా జరగటం అవసరం. కాని, ఈ విషయంలో మాకు ఏ వివరమూ సరిగ్గా తెలియదు. హత్య చేయబడిన స్త్రీ ఎవరో, ఎక్కడ హత్య చేయబడిందోకూడా తెలియదు.

మర్నాడు ఉదయం పోలీసువారు గుంపులు గుంపులుగా వచ్చి, చనిపోయిన స్త్రీ హేండ్ బ్యాగ్ కాని, ఆమెను చంపటానికి వాడిన పరికరం కాని దొరుకుతుందేమోనని వెతికారు. చీఫ్ కాన్‌స్టేబుల్ హోర్‌వెల్, సూపరింటెండెంట్ డొనాల్డ్‌సన్, వా రిద్దరూ వచ్చి, నాకు చాలా సాయపడ్డారు. బి. బి. సి., వార్తా పత్రికలూ కూడా తోడుపడ్డాయి.

పత్రికలలో పడిన బొమ్మనుపట్టి ఎందరో వచ్చి, హతమార్చబడ్డ స్త్రీని గుర్తుపట్టినట్లు చెప్పారు కాని, ఏ ఒక్కరి ప్రయత్నమూ సఫలం అయ్యేట్లు కనిపించలేదు. ఇలా ఉండగా అకస్మాత్తుగా ఆమె పేరు రోజ్ మురియల్ అట్‌కిన్‌స్ అని తెలిసింది. ఆమెకి కొన్ని మారుపేర్లు ఉన్నాయి. 'అయిరిష్ రోజ్', 'పాట్', వగైరాలు. చనిపోయే కాలానికి ఆమె పుట్నీ బ్రిడ్జ్‌రోడ్‌లో ఒక ఇంటి భాగం అద్దెకు తీసుకుని నివసిస్తున్నదని తెలిసింది. ఆమె మృతకళేబరం దొరికిన చోటు అక్కడికి ఎక్కువ దూరంలోలేదు.

ఆరోజు రోజ్ నల్లని సూట్, భుజాలకు నల్లని బొచ్చు కల చర్మం—చివర కొంచెం తెలుపు కలిసినది—వేసుకుని బయటకు వెళ్ళిందిట. చేతికి లేసుతో అల్లిన గ్లోవ్స్, తలమీదా అటువంటి టోపీ, వేసుకున్న స్త్రీ ఒకామె కొన్నిచోట్ల కనిపించినట్లు కొందరు చెప్పారు. ఈవిడ రోజ్ తప్ప మరెవరూ కారని తర్వాత తెలిసింది.

మధ్యాహ్నం హై స్ట్రీట్‌లో ఒక క్లబ్బుకివెళ్ళిందిట. అక్కడ అయిదు గంటలవరకూఉండి, తిరిగి ఇంటికి వెళ్ళిపోయిందిట. రాత్రి పది గంటలకు మాత్రం వింబుల్‌డన్‌వద్ద పార్క్‌సయిడ్ బస్ స్టాపులో బస్ దిగి రావటం ఎవరో గమనించారు.

చివరకు, ఆమెను 11—30 కి సజీవంగా చూసినట్లు ఒక అమ్మాయి చెప్పింది. ఆపైన కొన్ని నిముషాలకే చనిపోయినట్లు వైద్య నిపుణులు చెప్పారు.

రోజ్ ఇన్నర్‌పార్క్‌రోడ్ మలుపువద్దనుంచుని ఉండగా ఈ అమ్మాయిచూసి పలకరిద్దామని ఆమె వైపుగా నడిచిందిట కాని, ఇంతలో ఒక చిన్న ఆకుపచ్చని 'వాన్' (Van) వచ్చి ఆమె పక్కన ఆగిందిట. రోజ్ డ్రయివర్‌తో ఏదో చెప్పిన తర్వాత తనూ వాన్ ఎక్కి వెళ్ళిపోయిందిట. ఈ సంఘటన తర్వాత ఆమెని సజీవంగా చూసినట్లు ఎవరూ సాక్ష్యం ఇవ్వలేదు.

వెంటనే లండన్‌లోఉన్న ఆకుపచ్చ వాన్ లన్నిటినీ తనిఖీ చెయ్యటం మొదలుపెట్టాము. రోజ్ స్నేహితులు కొందరు ఆమె భుజాలకు వేసుకునే 'ఫర్' (బొచ్చు కల జంతు చర్మం)లో ఒక జేబు కుట్టించి అందులో డబ్బు దాచుకునేదని చెప్పారు. (రోజ్ వయస్సు 30. ఆమెకి ఇద్దరు పిల్లలు.)

దీనినిపట్టి దొంగతనంచేసే ఉద్దేశ్యంతో ఆమెనెవరో చంపిఉంటారని ఊహించాము. ఇంగ్లండ్ మా రు మూ ల లన్నిటిలోనూ పచ్చ—వాన్, (దాని డ్రయివర్), చిన్న లేసుతో అల్లిన తెల్లని టోపీ, చేతి సంచీకోసం వెతికే ఏర్పాట్లు చేశాము.

ఇది చాలా పెద్ద పని! ఎన్నివేల వాన్‌లని వెతుకుతాము? ఎంతమంది డ్రయివర్‌లని పరీక్షిస్తాము? అదృష్టవశాత్తు చీఫ్ ఇన్‌స్పెక్టర్ ఫ్రెడరిక్ చెర్రిల్ పరిశోధనలో పాల్గొన్నారు. ఈయన వేలి ముద్రలలో చాలా అనుభవంకలవాడు.

రోజ్ అట్‌కిన్‌స్ కుడికాలు స్టాకింగ్‌మీద టయరు ముద్ర పడినదని చెర్రిల్ అతి జాగ్రత్తతో పరిశీలించిన తర్వాత చెప్పాడు. ఈ ముద్రని ఇంకా అనుశీలించగా, అది ఏ రకమయిన టయరు వల్ల ఏర్పడిందో నిశ్చయించటానికి వీలయింది. ఆపైన అది 'మారిస్ సెవెన్' లేక 'మారిస్ ఎయిట్'కి పట్టే టయరని తెలిసింది.

చెర్రిల్ అనుమానాలు సరియైనవేనని చివర తెలిసింది. మారిస్ ఎయిట్‌లోనే రోజ్ మురియల్ అట్‌కిన్‌స్ హత్య జరిగింది.

హత్యానేరం జరిగిన ముప్పయ్ ఆరుగంటలకి—అంటే శనివారం 11 గంటలకు డివిజనల్ ఇన్‌స్పెక్టర్ బెవరిడ్జ్ టెలిఫోన్‌చేసి, ఆకుపచ్చ వాన్ దొరికిందని చెప్పాడు. మరెక్కడో దొంగతనం జరుగగా, చేస్తున్న విచారణలో బయట పడిందిట.

'హెన్‌క్రాస్' వీధిలో ఒక హోల్‌సేల్ వ్యాపార కంపెనీలో ఒక డ్రయివర్ 32 పవున్లకుపైగా కాజేసినట్లు ఫిర్యాదురాగా పోలీసువారు విచారణ ప్రారంభించారు. డ్రయివర్ పేరు జార్జి బ్రెయిన్. తల్లిదండ్రులతో లండన్‌లోనే ఉండేవాడు. ఆకుపచ్చని 'మారిస్ ఎయిట్' వాన్ ఒకటి నడిపేవాడు. వాన్‌ని ప్రతి రాత్రీ ఇంటికి తీసుకుపోయేవాడు. ఆ రాత్రి మాత్రం దానిని మరొక తోటి ఉద్యోగికి ఇచ్చేసి మాయమయిపోయాడు.

వాన్‌ని పరీక్ష చేయగా, అది కొంత కడిగిఉన్నప్పటికీ, నేలమీద కొంచెం నెత్తురుపడి, మరకలు అయినట్లు తెలిసింది. వాన్ యజమానుల స్థలంలో వెతకగా ఒక 'డస్ట్ బిన్'లో ఏదో కాలిన పదార్థం దొరికింది. వాన్‌తోబాటు వీనిని పరీక్షకి పంపారు. స్కాట్‌లాండ్ యార్డ్‌లో డాక్టర్ లించ్ ఈ పరిశోధన జరిపారు.

వాన్ ఉంచేషెడ్‌లు పక్క గదిలో రోజ్ అట్‌కిన్ చేతి సంచీ, చెప్పులు కుట్టేవారు ఉపయోగించే కత్తి ఒకటి, రక్తసిక్తమయిన పేలిక దొరికాయి. కత్తికి కూడా నెత్తురు మరకలు ఉన్నాయి.

నేను బ్రెయిన్ ఇంటికి వెళ్ళానుకాని, అతను మాయమయిపోయాడు. అతని తల్లిదండ్రుల ప్రశ్నించి హత్య జరిగిన రాత్రి 12—30 వరకు ఇంటికి రాలేదని తెలుసుకున్నాను. తల్లితో వాన్ ఆగిపోవటంచేత ఆలస్యం అయిందని చెప్పాడుట. ఆవిడ ఇతను ఏదో పరధ్యాన్నంగా ఉండటం గమనించింది.

ఇప్పుడు బ్రెయిన్‌ని పట్టుకొనటం ఎలా ముందురోజు కంపెనీ తరపున వసూలు చేసిన 3 పవున్‌లు చెల్లించక డబ్బు ఇంట్లో వదిలివేసి వచ్చానని చెప్పడంవల్ల కంపెనీవారు సోమవారందాకా గడువు ఇచ్చారుట. అంతేకాక, అతనితోటి డ్రయివరు అయిన ఆర్థర్ ఫ్రాస్ట్‌తో బ్రెయిన్‌తోబా

40 వ పేజీ చూడుము

నా అనుభవంలోకెలా పెద్ద పరిశోధన: యదార్థగాథ-2.



# హాస్యా లాస్యం



## పొడుస్తా! చెప్పగలరా?

'నోరులేదు—కాని
పరులు చెప్పే 'డైలాగులు'
తిరిగి చెబుతుంది!!....
చెవులులేవు, కాని
నీవు చెప్పే మాటలను
శ్రద్ధగా ఆలకిస్తుంది.......
బడిగంట అసలేకాదు......
కాని మ్రోగుతుంది గణగణ!!.....
కరెంటుమీద నడిచే
యంత్రం కాదది;
మంత్రగాడి చేతి గో
తంత్రం కాదది;
దాని పేరు ఏమిటో
జనులార! చెప్పగలరా??....
(స్వ) దేశవాళీ చిన్నది
అసలే కాదు,
అయినా తలపు దానికి
ఎన్నెన్నో గిరులు—
అయ్యరు హోటల్ కిది
ముఖ్య వస్తువండి!!! ...
ఇది లేందే సాంబారు
సాపడం—వద్దండి!!
దాని పేరేమిటో—
జనులార! చెప్పగలరా??—

జవాబులు:
—'టెలిఫోన్'—
—'నీరుల్లిపాయ'—

'యామున్' (వెలంపాలెం)

ఈ మధ్య ఒకానొక కాలువలో ఒక మనిషి శవం తేలింది. శవం జేబులలో 1. పది రూపాయల నోటు 2. ఒక సారాయి సీసా దొరికాయి.

విచారణ జరిగిన తర్వాత జడ్జీగారు, "ఈ వ్యక్తి ప్రమాదవశాత్తు చనిపోయినట్లు కనిపిస్తుంది. అయితే, చట్టానికి విరుద్ధంగా సారాయి సీసా ఉన్నందుకు పది రూపాయలు జరిమానా విధిస్తున్నాను....." అన్నారు.

కె. వి. ఎస్ (చీరాల)

## సినిమాలతో కథ

'రోజులు మారాయి' అన్నమాట మరచి 'అంతా మనవాళ్ళే' అని పొరబడి 'మనదేశం' 'ఇరుగు పొరుగు' దేశాలు, 'కలిసివుంటే కలదు సుఖం' అని ప్రచారం చేసింది. పంచశీలను మొదట 'ఆరాధన' చేసిన చైనా దానికి 'ఎదురీత' మొదలు పెట్టింది. 'రక్తసంబంధము' లేకపోయినా 'ఇద్దరు మిత్రులు' 'మంచి మనసులు' గలిగియుండి 'కులగోత్రాలు' ఎంచుకో కూడదని భారతదేశం చెప్పింది. 'ఆత్మబంధువు'లా వచ్చి మన 'ఇంటిగుట్టు' తెలుసుకుంది. 'సిరిసంపదలు' గలిగిన దేశాన్నిచూచి వోర్వలేకపోయింది. 'ముందడుగు'వేసి భారతావనిని రెచ్చగొట్టింది. 'అభిమానం'గల దేశం అది చూచి ఊరుకుందా? లేదు. 'హం ఏక్ హైఁ'అని ఘోషిస్తూ 'పదండి ముందుకు'అని ముందంజవేసి వారితో పోరలిపింది. చైనాకు మునుముందు 'అప్పుచేసి పప్పుకూడు' తినేరోజులు రాబోతున్నాయి. భారత ప్రజలు అందరూ 'ఒకతల్లి పిల్లలు'గా ఉంటూ 'జీవితం' సుఖంగా గడుపుకుంటున్నారు. అటువంటి వారికి ఈ చైనా పక్కలో బల్లెమువలెఉంది. భారత ప్రజ అందరూ వారిని ఎదిరించడానికి 'సిరకంకణము' కట్టుకొని సిద్ధముగా వున్నారు. వారికింకను భారత 'ప్రతిజ్ఞ' తెలియదు. ఏనాటికైనా 'జయం మనదే'

వంగల సూర్యనారాయణ (హైదరాబాద్

* * *

ఒక డాక్టర్ రోగిని పరీక్ష చేశాడు. వెంటనే రోగి నుంచుని "అయ్యా! మీ టెలిఫోను ఒకసారి ఉపయోగించుకోనిస్తారా" అని అడిగాడు. రోగి అనుమతి మీద ఫోను తీసుకున్నాడు.

"ఏమయ్యా రామారావు! ఇంకా నీకు ఇల్లు దొరకలా? ఇక్కడకో ఇల్లు ఇవాళో రేపో ఖాళీ కాబోతోంది" అంటూ ఆ యింటి నంబరు ఇచ్చాడు.

బ్రహ్మాజీ (బందరు)







"నాలో ఇద్దరు మిత్రులున్నారు" అక్కినేని

# తెరమీద
# తెరవెనుక

పి. రాజీ

[వెండితెరమీద రాణించినట్లే సామాజిక పారిశ్రామిక రంగాలలో రాణించడం సాధ్యమా? అంటే "ఆఁ...సాధ్యమేనని కళారంగానికీ సామాజికరంగానికీ 'పొత్తూ పొంతనా' కుదరదూ?" అంటే 'ఒప్పుకోను: కుదుర్తుంది' అని ధీమాగా ఖచ్చితంగా చెప్పిన ఆదర్శ నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుతో చేసిన ఇంటర్వ్యూనే ఇక్కడ ఈ శీర్షిక క్రింద తొలి సారిగా ప్రచురిస్తున్నాము.]

## "నాలో ఇద్దరు మిత్రులున్నారు"

ఈ మాట అన్నది హీరో నాగేశ్వరరావు తెలుగువాళ్ల అభిమాన నటుడైన 'కథానాయకుడు' నాగేశ్వరరావును, శ్రీ అక్కినేని గురించి అడిగినప్పుడు, ఆ 'ఇద్దరి' [రెండు వ్యక్తిత్వాల] సాన్నిహిత్యం గురించి, ఎంతో ధీమాగా అనుభవంతో అబ్బిన ఆత్మవిశ్వాసంతో, ఆయన చెప్పిన జవాబు పై వాక్యం.

ప్రతి ఇద్దరి మిత్రుల్లోను ఒక వ్యక్తి నిర్విరామ కృషిగా 'నిరంతర' యాత్రగా ఇంకో 'మెట్టు' ఇంకో 'ఎత్తు' అంటూ ఔన్నత్యానికి, కళాతృష్ణతో నట జీవితంలో పురోగమిస్తూవుంటే రెండో "మిత్రుడు" సామాజిక, పారిశ్రామిక రంగాలలో ఆదర్శ మానవుడిగా అనుభవజ్ఞుడై రాణించాలని, తద్వారా తృప్తి పొందాలని ఉవ్విళ్లూరే 'వ్యక్తి'— నటులలో అరుదైన ఈ ఆదర్శాలతోనే వ్యవహార రంగాన అడుగుపెట్టిన—అడుగుగెడుతున్న—అడుగు పెట్టబోతున్న దృఢ సంకల్పుడైన ఈ అగ్రస్థాయి నటుని ఉద్దేశంలో కళా, పారిశ్రామిక రంగాలు రెండిటి మధ్యా సామ్యంగావున్న లక్షణం 'దూరదృష్టి'—ఏది ఎంత ఎలా చేస్తే, అదీ యెప్పుడు చేస్తే తనకూ, సంఘానికీ నచ్చుతుంది? లేదా వప్పుతుంది' అనేది గ్రహించే అనుభవమే వీటి సమన్వయానికి 'నాంది' అని ఇరవై రెండు సంవత్సరాలపైచిలుకు మన వెండితెర కొక వెలలేని కాన్కగా ప్రజారంజక చేసిన అనుభవశాలి శ్రీ అక్కినేని నమ్మకం.

మనం సాధారణంగా తెరమీద నటుడైన నాగేశ్వరరావును చూస్తాముకాని, నిజ జీవితంలోకి వచ్చేసరికి నటుడూ + నాగేశ్వరరావు = నిండుకుండలాంటి విలక్షణమైన వ్యక్తిగా చూస్తాము.

అటు ఒక ఉన్నతమైన స్థాయీ, ఇటు పరిపూర్ణమైన వ్యక్తిత్వమూ సాధించిన శ్రీ అక్కినేనితో ఇంటర్వ్యూ చేద్దాము అనుకోగానే నిజం చెప్పొద్దూ, నాకు ఒట్టి ప్రశ్నలు అడగడం—దాంతో అతని "బిజీనెస్సు", "బిజినెస్సూ" రెండింటి "కాలం" పాడవడం ఇష్టమే లేకపోయింది. పైగా మీకు నూట్లు ఇష్టమా పంచెకు గోరంచు వుంటే బాగుంటుందా?" అనో, ఇంతకీ జిలేబీలమీద మీ అభిప్రాయం?—లాంటి ప్రశ్నలూ, కారు డ్రయివింగ్ లోని 'థ్రిల్లూ' అడగడం కూడా సబబనిపించలేదు. ఈ ప్రజా నటుణ్ణి అడగడానికి వేరే ప్రశ్నలున్నాయనిపించింది.

"ఇతని పూర్తి సక్సస్‌ఫుల్ కెరీర్"ను దృష్టిలో ఉంచుకుని, ఈ "సెంచురీ నాటౌట్ హీరో"ను ఇంచుమించు అందరికీ తెలిసిన విశేషాలతోనే, చిత్రాల జాబితాతో పరిచయానికి ప్రయత్నించడం, ప్రపంచం అంతా కలిపి, చిన్న "జాగా"లో జాగ్రఫీ పటం గీయడంలా వుంటుంది. అట్లాంటి వ్యాసం వేయాలంటే చిన్న 'కాయితం'మీద అన్ని పూళ్లూ, అన్ని పేర్లూ పట్టవ్. అందుకనే 'కవీన పక్షంపదే శైనా ఆలశ్యంగా చేస్తున్నానా ఆ పని?' అనిపించింది. అదే అపప్రథకు వెరిచి ఈ "జిగ" మెరిగిన "బ్రాహ్మడి"కి జందెముంది, అని పేర్కొనే "మార్కా" వ్యాసం రూపొందించదల్చుకోలేదు.

## అనుభవం : అధ్యయనం

ఈ అనుభవశాలిలోని సుగుణ సంపదను, ఆశయాల పటిష్టతనూ, ఆత్మవిశ్వాసాన్ని కొంతలో కొంతైనా నిరూపించగల నిర్మాణాత్మకమైన సమాధానాలనే ఇక్కడ పేర్కొంటున్నాను.

శ్రీ అక్కినేనితో సరదాగా, సీరియస్‌గా, హాయిగా అంతలో జోరుగా, ఎక్స్‌ప్రెస్ రైల్లో ప్రయాణం చేస్తూ, వెనక్కిపోయే పచ్చిక బయళ్లను చూస్తున్నట్లు సరస సంభాషణ థ్రిల్లింగ్‌గా జరిగిపోతుంది. ఆయన వాగ్ధాటికి మామూలు 'స్కోపు' యిస్తే అది కాస్తా "ఏనుగు"కు ముక్కాలిపీటవేసి కూచోమన్నట్లే ఉంటుంది.

శ్రీ నాగేశ్వరరావులో మంచి మాటకారితనం ఏ విషయంమీదనేనా 'సరే' తన అనుభవం, అధ్యయనం జోడించి సహజ చలోక్తులతోను, గంభీర



నిజజీవితంలో
వినయమూర్తిగా అక్కినేని.

చమత్కారాలతోను ఇంచుమించు మంచివీళ్ల ప్రాయంగా మాట్లాడగల శక్తి ఉండటాన్ని మొట్టమొదటిసారిగా కొంచెంసేపులోనే నేను గ్రహించాను. (నిజం చెప్పొద్దూ! నాక్కూడా మూడ్ వచ్చేసింది.)

శ్రీ అక్కినేని తెలుగు—సినిమాతోనే పరిణతికి ఎదుగుతూ వచ్చిన వ్యక్తి. ఇది "ఫాక్టు" (నిజం) అలాగే ఈ హీరో నాగేశ్వరరావుతో తెలుగు సినిమా కూడా ఎదుగుతూ వచ్చింది అన్నది "ఫాక్టున్నరా (నిజంన్నరా) అంతలోనే నాకు ప్రశ్న అడగడానికి ముందో చిన్న సంగతి జ్ఞాపకానికొచ్చింది.

"నాగేశ్వరరావు బయిస్కోపు మా రోజాలాడిందంటే గొప్పేటోస్......అది గంతే" నన్నమాట! 'సంసారం' సినిమా రోజుల్లో విరివిగా వినిపించిన మాట అది. పాగా చుట్టుకుని, లాంతరు పట్టుకుని, అమాయక యువకునిగా నాగేశ్వరరావు అగుపించినప్పటి "మాట". ఆ మాట పూరు దాటి, వాడ దాటి, ఆనక 'నమ్మినబంటు' వేళకి అందులోని నటనతో దేశమే దాటి, అక్షరాలా ఆ ప్రజా వాక్యాన్ని ఈ నటుని ప్రామురా [illegible] నిరూపించింది. శ్రీ అక్కి-

# రు. 2,000 ల బహుమతులు

## మేనర్స్ నూతన అదృష్ట పిల్లల పోటీ

## క్రొత్తగా జన్మించిన పాపలకు

శుభవార్త: మేనర్స్ అదృష్ట బాలల పోటీ యిప్పుడు ఏడాదికి ఆరు సార్లు జరుగుతుంది–1963 జనవరి నుండి రెండు మాసాల కొకసారి. ప్రతి పోటీకి బహుమతుల మొత్తం రు. 2,000 లు.

**మీ పాప పాల్గొనుటకు :** మీ పాప పుట్టిన తేది, కాలము మాకు పంపండి. మీ పాప పేరు, మీ చిరునామా, మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ అట్టపెట్టపై ముద్ర, న్యాయ మూర్తులచే నిర్ణయించబడిన తేదీకి, కాలమునకు అతి దగ్గరలోనున్నవాటికే బహుమతులు యివ్వబడును.

ఈ అదృష్ట పరంపరలో మొదటి పోటీకి పాల్గొనే పాపలు యీ సంవత్సరం జనవరి, ఫిబ్రవరి. నెలలలో పుట్టిన వారై వుండాలి. ఆఖరు తేది 1963 మార్చి 5. మీ వ్యాపారుని వద్ద నుండి ప్రవేశ పత్రాలు, వివరాలు పొందండి.

1వ బహుమతి రు. 1,250/-(నెలకు రు. 22.60 ల చొ॥న 5 ఏళ్లకు)*

2వ బహుమతి రు. 500/-లు నగదు

3వ బహుమతి రు. 250/-లు నగదు

ప్రవేశ పత్రలు ఈ చిరునామాకు పంపండి:
మేనర్స్ లక్కీ బేబీ ఫెస్టివల్, పోస్టు బ్యాగ్ నెం. 10116, బొంబాయి-1.

తర్వాతి నెలలలో పుట్టిన బాలలకు పోటీ వివరాలు తెలుసుకొనుటకు మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ ప్రకటనలను చూడండి.

* దెవర్ష ఎన్నుకుంటే వారికి







మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ పాపను చిరునవ్వులతో వుంచును.

ASP/GM/BF3/1 T&L

GEOFFREY MANNERS & CO. LTD

# హీరో నాగేశ్వర రావు

వేని సినిమాలు శత దినోత్సవాలు చేసుకున్నాయి అంటే మామూలుగా మే—అతని సినిమాలు రజితోత్సవాలు చేసుకున్నాయి—ప్రెసిడెంట్ అవార్డులు, మెరిట్ పతకాలూ ప్రజల మన్ననలూ పుచ్చుకున్నాయి.

## మైలురాళ్లు: గీటురాళ్లు

మేం మాట్లాడుకున్న గదిలో ప్రత్యేకించిన అలంకారాలేం లేవు గాని, ఇతని ప్రతిభకు గీటురాళ్లైనవి, అమూల్యమైనవి, సామర్థ్యానికి లభించినవి, షీల్డులు, చిహ్నాలు కనుల పండువుగా ఉన్నాయి. అందుకే ఈ 'రిఫరెన్సు' కూడా నేను చేస్తూ..... ("ఇన్ని చూసుకుని కూడా ఈయన గర్వంగా గాక, సగర్వంగా ఎలా ఉంటాడు చెప్మా" అనుకున్నాను.)

ఇక ప్రశ్నల దగ్గరకి వస్తాను.....

● ప్రశ్న:—తెరమీద 'అఖండమైన' కీర్తి పొందిన మీరు వ్యక్తిగత సామాజిక జీవితంలో కూడా చాలా ప్రతిష్ఠను గణించారు. ఈ రెండిటి ప్రభావం (Influence) మీరు పోషిస్తున్న పాత్రల మీదపడుతున్నదని కొందరంటారు—మీరేమంటారు?

"పడుతోంది" అంటాను అని అంటూనే ఈ మాటను మనం అపార్థంపాలు జేసేలోగానే "అది అంతర్గతంగా పడుతుంది. బహిర్గతంగా గాదు" అంటూ పూర్తి చేశా రాయన. [అందుకే "నిండు కుండ తొణకదు" అనిపించిందని పైనే వేస్తాను] పోతే పూర్తి సమాధానం ఆయన మాటల్లోనే విందాము.

"ఆ ప్రభావం" అంతర్గతంగా ఎలా పడుతోంది అంటే, నేను కష్టపడి కృషి చేసిందుకు నాకు తగిన పాత్రలు వచ్చి, వాటిని ప్రజలు మెచ్చి, నన్ను నటుణ్ణి చేశాయి. ఇది ఎంత కష్టంతో కూడుకొన్నదో అంత బాధ్యతతో కూడుకున్న విషయమని అభివృద్ధిలోనికి వచ్చిన ప్రతి నటుడూ గుర్తిస్తాడు. అలాగే వ్యక్తిగతంగా తను సంపాదించుకున్న మంచి పేరునుకూడా గుర్తించుకొని, నట జీవితంలో వున్న సామర్థ్యాన్ని, నిజ జీవితంలో వున్న వ్యక్తిత్వాన్నీ ఈ రెంటినీ సమన్వయపరిచి తర్వాతనే జీవితంలో ముందడుగు వేస్తాడు—అంచేత ఈ రెండింటినీ జోడించేటప్పుడు, నేను పెద్ద పలుకుబడిగల వ్యక్తినీ అనుకుని విర్రవీగితే 'పాత్ర' పోయి, తన కుందనుకున్న దంభ స్థాయీ, అహంకారం ముందుకు వచ్చి నట జీవితాన్ని ధ్వంసం చేస్తుంది. అలాగే నట జీవితాన్ని నిర్ణయించుకొనేప్పుడు—తను చేసే నిర్ణయాలను, తనను అభిమానించే అభిమానుల మనస్తత్వాలను, వారికి తనపట్ల వున్న సుహృద్భావాన్ని గుర్తుంచుకొనక పోతే—అవి తప్పుదారి తీయొచ్చును.

"నట జీవితం, సామాజిక జీవితం కూడా దెబ్బ తినవచ్చును. కాబట్టి ఈ సమన్వయం అంతా చాలా బాధ్యత గంది. దీని నిర్వహణలో నేను ఎంత కృత కృత్యుణ్ణయ్యానో చెప్పలేను. గాని, మీ ప్రశ్నలో వున్న భావమే నిజమైతే "అది" అంతర్గతంగా కనిపించే వాటిలో వున్న బాధ్యత నే [illegible] గాదు"

ఈ జవాబుకు వేరే వ్యాఖ్యానం అక్కరలేదు కదా! ఇది ఒక కళారాధకుని పట్టుదలను, అది సాధించిన తీరును స్పష్టంచేసేగా



## అవార్డులూ – ప్రశంసలూ!

'ధర్మపత్ని' నుంచి 'అర్ధాంగి' వరకూ, 'సంసారం' నుంచి 'ఇద్దరు మిత్రులు' వరకూ, 'కీలుగుర్రం' నుంచి 'సువర్ణసుందరి' వరకూ, 'లైలామజ్నూ' నుంచి 'దేవదాసు' దాకా, 'బాలరాజు' నుంచి 'కృష్ణార్జున యుద్ధం' వరకూ, అలాగే కాళిదాసుగా, రామకృష్ణునిగా యిలా యించుమించు అన్ని విభిన్న తత్వాలుగల పాత్రలకు జీవధనం పోసి అపారమైన అనుభవం ప్రజాదరణ పొందిన ఈ నటుడు ఈ 'తపస్సు' లో తను పొందిన 'విజ్ఞాన ధనమే ఎక్కువ' అంటాడు.

"[illegible]" ప్రతిష్ఠలు గల శ్రీ అక్కినేని [illegible]మే అతనికి అమూల్యమైన భూష[illegible] [illegible]న్నదని పెద్దంలగా నేను విన్నాను. ఐనా నిరంతరం "విన్న" కన్న 'మిన్న'గా రాణించావ సంగతిని; ఇంకా విపులీకరించే సమాధానాన్ని పొందగలిగింది.

● ప్రశ్న:—నటనకు ఒక పరిణతి వున్నదన్నదే నిజమైతే అది మీలో వున్నదని జనవాక్యం ఐనా

# తెరమీద - తెరవెనుక

దేవదాసుగా, [illegible], కాళిదాసుగా, రామకృష్ణగా ఇలా విభిన్నమైన పాత్రలను పోషించిన మీరు ఇంకా విభిన్నమైనవీ, కొంగొత్తవీ, పాత్రలు వేయాలని అనుకుంటున్నారా? మీ కళాజీవితంలో లక్ష్యసాధన అంటే ఏమిటి?

శ్రీ అక్కినేని జవాబు:—లక్ష్యమనే దానికి అర్థం నాకు తెలియదు. మీ రన్నట్లు నేను అనేక రకాలైన



'సవ్యసాచి' వేషంలో నాగేశ్వరరావు

మనస్తత్వాలను నటించాను. ఆ పాత్రలను అనుభవించాను. దానిమూలాన్నా తిరుగాడే పాత్రలను చవి చూశాను. కాని ఈ పాత్రలన్నీ ప్రజా జీవితాలకు ప్రతిబింబాలే అంటారుకదా.........తే ఒక్క మన భారత దేశంలోనే వున్న 44 కోట్ల మానవ మనస్తత్వాల ప్రతిబింబాలైన ఒక్క మా[illegible]డును మాత్రమే నే పోషించా వన్నమాట. వీటి పోషణ నేను ఎలా చేసినా ఒక లక్ష్యం లేకుండా మాత్రం కాదు. కాని, లక్ష్యానికి ఈ కళారంగాన మాత్రం అవధిగల రూప కల్పన మాత్రం లేదు. ఈ 'లక్ష్య' మనేది, లేదా గమ్యమనేది తతిమ్మా రంగాల్లో ఉన్నది. ఉదాహరణకి ఎత్తైన పర్వత శిఖరాలను సాధించదల్చుకున్నప్పుడు ఆ "ఎత్తే" లక్ష్యం. సంద్రగర్భాన్ని తాకి చూడాలనుకున్నప్పుడు తాకడమే లక్ష్యం. దేశాధిపత్యం కావాలనుకుంటే అది దొరకగానే లక్ష్యం నెరవేరినట్టే. ఇలా ఆయా రంగాలలో లక్ష్యానికి ఒక రూపకల్పన చేసి, దాన్ని సాధించవచ్చును గాని, మా కళారంగంలో లక్ష్యం లేకుండా ముందడుగు వేయలేం గనుక, దానికొక అవధులు మాకు లేవు. అయితే ఒక లక్ష్య కల్పన చేసుకోడం ఎలాంటి కష్టమైందంటే ఉదాహరణకి ఇలా చెప్తాను:

## అనంతం: అపారం

"ఒక కుండనిండా నీళ్ళుపోసి, నెత్తిన పెట్టుకుని నాట్యకత్తె నృత్య విన్యాసాలు చేస్తుంటే ప్రజలానందిస్తారు; మెచ్చుకుంటారు. ఐతే ఆ నటి ప్రజలకు నీళ్ళు తొణక కుండా అగుపింపజేస్తూ కుండలోని నీళ్ళను తన దృష్టిలో మాత్రమే ఉంచుకుని వారిని రంజింపజేయాలి. ఇదుగో, అదే లక్ష్యానికి రూప కల్పన. కుండలోని నీళ్ళు ప్రజలకు అగుపించక పోయినా అంతే; లక్ష్యం అగుపించదు. అంచేతనే ఇలా అవధులు లేని అపురూపమైన లక్ష్యంతో ఇంకా వివిధ మనస్తత్వ ప్రతిబింబాలు కాగల పాత్రలు ధరించాలని, తద్వారా అనుభూతిని పొందాలని నాకు ఉంది. లక్ష్యాన్ని చేరుకున్నామా అన్నా, లేదా సాధించా నన్నా పై కోర్కె లేదనుకోడం. అందుకనే నా లక్ష్యం నెరవేరిందని మీ రన్నా, అలా అనుకోడం నా కెలా సాధ్యం?"—

అవును! పై సమాధానం నిజంగా గొప్పదే. ఎందుకంటే అంతూ, దరీ లేని కళాతృష్ణ; అవధులకూ, అడ్డుగోడలకూ అతీతమైనది! నటుని ఆదర్శం, ఆకాంక్ష—ఈ రెండూ అపారమైనవి. అందుకనే ఇంకా హీరో నాగేశ్వరరావు మరిన్ని పాత్రలు వేయాలని, అందులో జీవించి, ప్రజాభిమానాన్ని మరింతగా పొందాలని మనం కోరుతున్నాము. ఈయనకు, ఈ ఉన్నతికి రావడానికి ఆత్మనిగ్రహం, దీక్ష, పట్టుదల తోడ్పడ్డాయి. అయితే ఇది పలువురు వ్యక్తుల, సంస్థలతో ముడిపడిన 'కెరీర్' గనుక మరో ప్రశ్న వేయడంలో నేను అపార్థం పాలు కాలేదనే చెప్పాలి. నా ప్రశ్న ఇది—

● ఇంతగా రాణించిన మీకు చలన చిత్ర పరిశ్రమ అందలి వ్యక్తులు ఎంతవరకూ దోహదించారు, అంటే ఉత్తమ నిర్మాణం, ఉదాత్తభావ గర్భితమైన పాత్రలు లభ్యమవడం మొదలైనవి అన్నమాట. అసలు పైకి నటుడు రావడంలో తటస్థపడే అంచెలు ఏవి? ఎలాగుంటాయని నా ఉద్దేశంగా కూడా ఈ ప్రశ్నలోనే విడమర్చాను. అందుకనే శ్రీ నాగేశ్వరరావు కేటాయింపుగా ఒక్కో మలుపును వివరిస్తూ, ఈ దిగువ జవాబును చెప్పాల్సివచ్చింది.

## అవకాశాల మెట్లు

శ్రీ అక్కినేని జవాబు:—నటునికి 'పాప్యులర్ పిక్చర్' లో నటించే అవకాశం రావడం అవసరం. ఎందుకంటే, ధన రూపకంగా విజయవంతమైన చిత్రాలు ప్రజా బాహుళ్యంలో నటుణ్ణి అందరికీ తెలిసేలా చేస్తాయి. అనక కళాత్మకంగా విజయవంతమైన చిత్రాలు (అందులో నటునికి అవకాశం వస్తే) ప్రజా హృదయాల్లో నటునికి ఒక రూపం, స్థానం ఏర్పరుస్తాయి. పైన పేర్కొన్న మొదటిరకం చిత్రాలు, నటుడికి ధైర్యాన్నిస్తాయి. పై రెండు రకాల రాణింపును పొందిన చిత్రాలు నటుని ప్రతిభకు తార్కాణాలై నిలుస్తాయి. అతనికి నటనలో ఆత్మానందాన్ని పొందగల అవకాశం ఉంటుంది. ఈ ఆత్మానందం పొందడానికి సమర్థత, చూపడానికి అవకాశం వచ్చినప్పుడు ఒక అనుభూతి కలుగుతుంది.

అవకాశాము నటుడు ముమ్ముందు సాధించబోయే విజయాలకు దారి చూపుతుంది!

.. జనరల్గా జా చేసిన ఈ జవాబులో శ్రీ అక్కినేని 'సృష్టి' స్పష్టంగా అగుపిస్తుంది మనకి. వాస్తవానికి ఈ అవకాశాలన్నీ, అతనికి లభ్యమైనవి. వాటిని సద్వినియోగం చేసుకున్న ఘనత మాత్రం అతనిలో పుష్కలంగా ఉన్నది.

శ్రీ నాగేశ్వరరావు సాంఘిక, పారిశ్రామిక రంగాలకు తన ఆదర్శాలను, ఆకాంక్షలను విస్తరింప జేస్తున్నట్లు ఇవాళ ప్రత్యేక పరిచయంగా చెప్పక్కర్లేదేమో. ఈ నటునికి చాలమందికి అరుదైన పబ్లిక్ లైఫ్ ఉన్నది. అయితే చాలామందిలో "ఆర్టిస్టూ—బిజినెస్సూ" అనే జంట పదం కుతూహలాన్నేగాక, జిజ్ఞాసనూ రేకెత్తిస్తుంది. అంచేతనే ఇతనిలోని పట్టుదల, సామర్థ్యం—రెండూ కన్పిస్తున్నంగా విదివున్న మనలో కొందరికి సందేహం కలుగుతుంది. కలగక మానదు. అందుకనే కాస్త నిర్మొహమాటంగానే ఈ ప్రశ్న అడిగాను. ● ప్రశ్న ఇది:—పారిశ్రామిక (సాంఘిక) రంగానికీ, కళారంగానికీ పొత్తు కుదర దంటారు. మీ రీ మాటలను ఒప్పుకుంటారా?

వెంటనే 'ఒప్పుకోను' అంటూ ఠంగుమని జవాబు వచ్చిం దాయననుంచి. అది చాలు ఈ అనుభవజ్ఞుని ఆత్మవిశ్వాసానికి మచ్చుతునకగా. శ్రీ నాగేశ్వరరావు ఈ రెంటికీ "పొత్తు కుదుర్తుంది" అంటారు. ఎందుకంటే ఆయన "దృష్టిలో ఈ రెండింటికీ ఒక విషయంలో మాత్రం సామ్యముంది." అదే ఈ రెండింటిలోనూ వుండే "దూరదృష్టి." "నటునికి తన నటన చూపించి ఆనందింప జేయవల్సిన ప్రజలయొక్క అభిరుచిని గ్రహించాల్సిన అవసరం ఎలాగైతే వున్నదో, అలాగే పారిశ్రామిక వేత్తకు దేశావసరాలు ఎలా ఉన్నాయో ఆలోచించుకోవల్సిన శక్తి కావాలి; అవసరం వుంది. అంచేతనే ఈ రెండు రంగాలకు ఈ లక్షణంవల్ల పొత్తు కుదుర్తుంది. ఎలాగంటే ఒక నటుడు అనేక పాత్రలు నటించి ప్రజల మెప్పును పొంది, తనను అభిమానించేవారి మనస్తత్వ మెరిగి ఉంటాడు."

"సమర్థుడైన నటుడు తను పోషించే కథనూ, దాని నిర్మాతల శక్తిసామర్థ్యాలనూ, దాన్ని నిర్మించే దర్శకుని ప్రతిభనూ ఊహించుకోగలడు. తను నటించబోయే పాత్ర ఎలా నిర్వహిస్తే ప్రజలను రంజింపచేస్తాడో నిర్ణయించుకునే విధానాన్ని పూహించుకునే శక్తిసామర్థ్యాలు నటుడికి ఎలా ఉండాలో అలాగే పారిశ్రామికవేత్తకు కూడా దేశానికి ప్రస్తుతం ఏం కావాలి, ఏది తక్కువగా వుంది, ఏది ఉత్పత్తి చేస్తే, ఎలా ఉత్పత్తి చేస్తే ప్రజలకు సరిపోతుందో పూహించుకునే అవసరం అంతే వుంది. ఈ మొదటిది నేను కొంతవరకేనా చవి చూశాను గాబట్టి, అటువంటి చూపుతోనే, ఆ అనుభవం పాటిస్తూ రెండోది చెయ్యవచ్చుననీ, అంచేత ఈ రెంటికీ పొత్తు, పొందికా కుదుర్తుంది అని నమ్ము తున్నాను. ఆ విశ్వాసంతోనే ఈ రంగంలో ప్రవేశిస్తున్నాను."

(మిగతా పైవారం)



అన్నపూర్ణావారి చిత్రం వెలుగునీడలు లో పద్మనాభం, కృష్ణకుమారి.

# అవీ - ఇవీ - అన్నీ

## "సినిమాలూ - కథలూ"

### [ద్వైమాస పత్రిక]

రెండువందలనలభై పేజీలు; రెండు నెలల కొకసారి. వెలరూపాయికి వచ్చే ఇందులో ప్రేక్షకులకు కావల్సిన సినిమాలూ, కథలూ—పైగా కార్టూన్లూ వార్తలూవున్నాయి. ఈ కొత్త పత్రికలో ఒక వెండితెర నవల + ఆరివిన్నా సంగతులూ ఆకర్షణీయంగా ఉన్నాయి.

మా కార్యాలయం చేరిన యీ పత్రికను శేయాస్ పబ్లికేషన్సు విజయవాడ వారు ప్రచురించారు. దీని మేనేజింగ్ ఎడిటర్ శ్రీ కొటగడ్డ నరసయ్య. ఇందులోని వెండితెర నవల "ఆత్మబంధువు"—బాగుంది.

* * *

## "రేలంగీ చిత్రమందిర్"

నిర్మించిన రేలంగి చిత్రమందిర్ సినిమాహాలుకు 6వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది. ప్రఖ్యాత దర్శకులు శ్రీ కె. వి. రెడ్డి దీనికి ప్రారంభోత్సవం చేయగా, స్త్రీల మేన్‌గేటుకు ప్రఖ్యాత తార కుమారి జమున ప్రారంభోత్సవం చేసింది. వెండితెరను శ్రీ రంగారావు ఆవిష్కరించగా, శ్రీ సి. పుల్లయ్య ప్రొజెక్టర్ ఆన్‌చేశారు. యీ సందర్భానికి పశ్చిమ గోదావరిజిల్లా కలెక్టర్ శ్రీ నాయర్ అధ్యక్షత వహించారు.

## కొల్గేట్ - పామాలివ్ చిత్రాలు

చలనచిత్రాలు వినోదానికి, విజ్ఞానానికి చక్కగా ఉపకరిస్తున్నవనీ, చాలా విజయం పొందుతున్నవనీ తెలిసిన విషయమే. అయితే సినిమాలు వ్యాపార ప్రచారసాధనంగా కూడా ఉపయోగపడని కూడా



కొల్గేట్ పామాలివ్ వ. పెనీలు తయారుచేసే



## అవీ - ఇవీ - అన్నీ

జుగా వైంది మన దేశంలో ఇలాంటి వ్యాపార ప్రచార చిత్రాలు నిర్మించటంలో కాల్గెట్—పామాలివ్ సంస్థదే పై చేయి

దర్శకుడు, కవి, అనయునసౌష్టవం గల పాత్రధారులతో హాలివుడ్ సాంకేతికవేత్తల సంహాలతో ఈ కాల్గెట్—పామాలివ్ సంస్థలు సుమారు 100—120 అడుగుల్లో నిర్మించే వ్యాపార చిత్రాలు బాగా విజయం సాధించటమే గాక, మన దేశంలో బి ఆర్ చోప్రా లాంటి సినీ ప్రముఖులను కూడా ఆకర్షిస్తున్నవి

## భ ర త నా ట్యం

పలువురు పురప్రముఖుల, సినీపరిశ్రమకు చెందిన వ్యక్తుల సమక్షంలో, మద్రాసులోని పిల్లల థియేటరులో, శ్రీ డి యస్ శాస్త్రి మనుమరాలు, శ్రీమతి కె జె సరస శ్వరాలు కుమారి ఉష, తొలిసారిగా భరతనాట్య ప్రదర్శనాన్ని ఇచ్చింది శాస్త్రీయమైన పద్ధతులలో రసిక జనరంజకంగా ప్రదర్శనాలిచ్చినను కుమారి ఉషను ఆశీర్వదిస్తూ మద్రాసు మంత్రి శ్రీ భక్తవత్సలం ప్రసంగించారు ఈ నాట్య ప్రదర్శనానికి ఆయనే అధ్యక్షత వహించారు

## 'మాడమ్' అపార్థంపాలు

ప్రవీణ్ చౌధురి అనే హిందీతార 'మాడమ్' అనగానే మండిపోయిన వైనం ఒకటి ఈమధ్య తెలిసింది 'మాడమ్' అనడం అటుంచి, ఆమెను ఒక యువకుడు (ఫాన్) "మీ రే టెంతండీ ?" అన్నాడట ఆమె పులిలా లేచి లేడిలా చెంగున ఎగిరి కాలినున్న జోడు తీసుకుందిట అసలు ఏం జరిగిందంటే ఆ యువకుడు ఆమె 'సంతకం' ఖరీదు అడిగాడు ఇదెలా జరిగిందంటే ఎస్ డీ నారంగ్ నిర్మిస్తున్న చిత్రం తాలూకా లొకేషన్ షూటింగులో జానీవాకర్, ప్రవీణ్, చౌధురీ పాల్గొంటున్నప్పుడు ఆ దారే వచ్చిన పిక్‌నిక్ బృందంలోని యువకు డొకడు 'జానీ'ని ఓ ఆటోగ్రాఫు యిమ్మన్నాడు జానీ అచ్చం సొంత నవ్వు నవ్వి "భాయ్ ! రక్షణ నిధికి ఓ రూపాయ్ పడెయ్ సంతకం చేస్తా" నన్నాడు

సరే ! యువకుడు రూపాయి కా సంతకం పుచ్చుకుని యీామె దగ్గరకు పోయి "మాడమ్ ! మీ రెంత పుచ్చుకుంటా ర" నబోయి గభిక్కున పొరపాట్లో అలవాటుగా 'మీ రేటెంత' అన్నాడు. వెంటనే హైహీల్ జోడుతో ఆడపులిలా లేచిన అందాల అభినానతారకు ఎడంగా తప్పుకుని "నే రోమ్యోని గాను, ఆటోగ్రాఫుల వేటగాణ్ణి" అని మనవిచేసుకున్నాడు. ప్రవీణ్ శాంతించి, "సరే ! మాడమ్ అని ఎన్నడూ నన్ను పిలవ్వొద్దు" అని హెచ్చరించి సంతకం యిచ్చి ఆ "ఫాన్" ని పంపించేసి. ఉన్నదంది

# పెంచిన ఋణానుబంధంతో
# పెరిగిన కథ 'పెంపుడు కూతురు'

[చిత్రసమీక్ష]

**నిర్మాత — దర్శకుడు [పద్మినీ పిక్చర్స్]: బి. ఆర్. పంతులు. రచన: నరసరాజు; పాటలు: అనిసెట్టి, నారాయణరెడ్డి, కొసరాజు. సంగీతం: లింగప్ప. నటీనటులు: రామారావు, జానకి, దేవిక, హరనాథ్, రేలంగి మాలతి, రమణారెడ్డి, అంత సత్యం అరుణ్కాళి, రమాదేవి, విశ్వనాథం, బాలకృష్ణ మొదలగువారు.**

ఉమ (దేవిక) అనే అమ్మాయి తాను పెంపుడుకూతురే అయినా తల్లికిచ్చిన మాట నిలుపుకునేందుకు చివరి వరకూ "రౌడీ" అయిన రామారావు (అన్న) రఘురాంనూ, రేసానురుడూ, దొంగా, ఐన తండ్రి (రమణారెడ్డి) 'తిరుపతి'ని సంస్కరించేటందుకు ప్రయత్నించడం ఒకటే మంజులఅనే అమ్మాయి (జానకి) తనకు జరిగిన అవమానం వల్ల చివరికి గుడ్డిదై పోయినప్పుడు కూడా రఘురాంను (రామారావు) భర్తగా స్వీకరించలేకపోయి మానసిక వ్యధకు గురియై చివరకు కనులతోపాటు భర్తనుకూడాపొందడం—రెండూగా; పెంపుడుకూతురు సినిమా నడుస్తుంది. ఉమకథా, మంజులవ్యథా ఈ రెంటినీ చిత్రీకరించేటప్పుడు కొన్నిచోట్ల కేవలం "థ్రిల్ థ్రిల్" అంటూ కేకలూ, మరి కొన్నిచోట్ల కొంత స్కిల్, కొంత థ్రిల్ మరి రెండు 'మంచి' పాటలూ పెట్టి నిర్మాతలు మంచికాలక్షేపంగా తయారుచేశారు.

'మర్డర్! హత్యా! ఖూనీ!' అంటూ దేవికోసు కేక వేయినా అంతలా అరుస్తూ ఆదినపరిచయమై అదే 'థ్రిల్'అనే అపరాధ పరిశోధక శిఖామణి దశావతారంగా, (మంజుల తండ్రి)గా రేలంగి, ఉమ పాటంటే 'చెవికోసుకుని', అనకరవడ "వాయించు"కుని, ఆమెను వివాహమాడి కథావసరాన్ని గుర్తెరిగి అమెరికా వెళ్లిన "మంజుల" అన్న వాసుగా హరనాథ్ నటించారు.

కథలో 'మంజుల' పాత్ర బలమైనది, ఒక "కారణం" ఉండి, దానికి "ఫలితం"గా వచ్చే సైకలాజికల్ రియాక్షన్ గల యీ "పాత్ర"ను జానకి ("మేకప్ కాస్త బాగుంటే బాగుండేది.) సమర్థవంతంగా విభాయించింది. మరో ముఖ్యపాత్ర 'శాఖ' సంస్కారహీనుడుగా ఉండి, పశ్చాత్తాపం కలిగి, తర్వాత సంస్కార పటిమ గలవాడైన 'ఉమ' అన్న రఘురాంది. బహుశా యీ టీవల సర్వాగా రెండు మూడు చిత్రాల్లో మన కగుపించిన రామారావు యీ చిత్రంలో తిరిగి ఉన్నత ప్రమాణంగల నటనను చూపించడం అగుపిస్తున్నది. కథాగమనం, పాత్ర స్వభావమైనా కూడా తనకు చాలినంత "ఊత" ఇవ్వకపోయినా 'రామారావు' యీ చిత్రంలో "క్లాస్ ఎలిమెంటును" ప్రవేశపెట్టడం గమనార్హం. పోతే దేవిక—పాత్ర సానుభూతికి నోచుకునే పాత్రయే! హరనాథ్ తనకన్నా కాస్త మిన్నగా ఎదిగి నటించాల్సి రావడం—అందుకు ప్రయత్నించి సర్దుకునేలోగానే ఆ పాత్ర అమెరికా వెళ్లిపోవడం జరిగింది. కాని ఈ వర్తమాన నటుడు "ప్రామిసింగ్" అనడానికి యీ నటన చాలు. రేలంగి, కనిపించిన కాస్సేపే ఐనా మాలతి (వెటరన్) చిత్రం అయిపోయినాకా చాలాసేపు జ్ఞాపకంగా ఉంటారు.

"నాకు కనులు లేవు, నీవు పలుకలేవు" అన్న పాట హాయిగాను 'ఏది వెలుగు లేదే' పాట గంభీరంగాను ఉండి ప్రజామోదం పొందుతాయనిపించాయి. "క్రైము వాల్డేదు. ఆఖరి ప్రశ్నలకు జవాబులు "టూకీగా" రాశాను, అనే పరీక్షార్థి 'ఆన్సర్ పేపర్' లాగా యీ 'టాకీ' లో చివరి రీళ్లల్లో సంఘటనలు కల వేగంగా దూకి, ముగింపు "థ్రిల్లింగ్"గా వచ్చేస్తుంది. అయితే కాలక్షేపంగా నడిచిన రీళ్లల్లో గల అనుభవజ్ఞుడైన దర్శకుని "స్కిల్" చిత్రాన్ని, ముగింపునూ కూడా ప్రజలకు నచ్చచెబుతుంది. "ప్రేమ గుడ్డిదే కాదు మూగది కూడా" కాని "త్యాగం ఎంత సినిమాటిక్ అయినా గొప్పది; ఫలితాలు సాధిస్తుంది, అనిపిస్తుందీ చిత్రం చూశాక. మిగతా నటులంతా పాత్రోచితంగా నటించారు. 'రామారావు' కుస్తీ పోట్లు, రేలంగి అపరాధ పరిశోధనలు వారి అభిమానులను విశేషంగా ఆకర్షిస్తాయి. అలాగే కథ చివర అనవాయితీగా ఉండే "బీభత్సరసం" ఇందులో లేదు. అదే మేలు! కుటుంబసమేతంగా చూడతగ్గ చిత్రం.





"పెంపుడుకూతురు"లో దేవిక, హరనాథ్.

# గోడమీద బొమ్మ

25 వ పేజీ తరువాయి

గం చేస్తారు ? నా వివాహం నా భవిష్యత్తుని కత్తిరిస్తున్నది. ఇక్కడ ఎన్నాళ్లా వుంటావన్నారో మీకు తెలియు? అమ్మా నాన్నల భారం తొలగించా రనుకున్నారా ? నాకు విముక్తి ప్రసాదించండి." ఇది పార్వతి ఉత్తరంలోని సారాంశం. ఇది మొదటి ఉత్తరం. ఎంత బాధపడుతున్నదో పార్వతి అను కున్నాను.

మామయ్యగారింటికి తీరికలేక ఈ అయిదేళ్ళ నుంచి వెళ్ళలేదు ఎక్కువగా. ఈ మూడేళ్ళలో అసలు వెళ్ళనేలేదేమో. వెళితే నేను పూర్తిచేయలేని ఒక ప్రశ్న ఆ కుటుంబంలోని అందరి ముఖాలలో ఉదయిస్తుంది.

"బాబుగారు, గది శుభ్రం చేసినాను" అన్నాడు సీను; క్యారేజి తీసుకుని వెళ్ళబోతూ.

తలూపి, గదిలోకి పోయాను.

కిటికీదగ్గర నిలబడి బయటకు చూశాను.

శిధిలమవుతున్న కాంపౌండు గోడమీద ఎవరో బొగ్గుతో ఒక స్త్రీ బొమ్మ వేశారు. దాన్ని చూస్తుంటే నా గుండెల్లో ఎవరో వేలుపెట్టి కెలికినట్లుయింది.

మరిచిపోదామనుకున్న పార్వతి ఆ బొమ్మను చూడగానే మనస్సులో మెదిలింది. భిక్షాపాత్ర పట్టుకుని నిలబడిన ఆ నల్లటి బొమ్మకీ పార్వతికీ భేదం కనిపించలేదు నాకు. పార్వతి కూడా నా ప్రేమ భిక్షనే కోరుతున్నది. ఎవరు గీశారో ఆ బొమ్మ ? ఎవరి మనస్సు దుఃఖసుఖాలతో వడబోయబడి ఈ చిత్రం గీయించిందో ? నా కెందుకో భరించలేని నీరసం ఆవరించినట్లయింది. తలెత్తి సూటిగా ఆ నల్లటి బొమ్మవంక చూడలేకపోయాను. ప్రాణంలేని ఆ బొమ్మ మౌనంగా నా హృదయాంతరాళాల్లో ఆవేదనను సృష్టిస్తున్నది. పార్వతి వేదనకి ప్రతిధ్వనిగా ఈ చిత్రం నిలిచింది.

కాలం స్తంభించిపోయినట్లు అనుభూతి పొందాను. గడియారంలో కాలం చిక్కుకుపోయినట్లుంది. పార్వతి అదృశ్యంగా ఇక్కడకు వచ్చి, తన మనస్సును కుంచెను చేసి తన కన్నీటిలో ఆ కుంచెను ముంచి ఈ చిత్రం వేసిందేమో ?

ఎప్పుడో సంవత్సరాల క్రితం ఏకాగ్రతతో ఊహించుకున్న దాంపత్యాన్ని తిరిగి ఈ అస్పష్ట నవజాగృత చైతన్యం కూడదీస్తోంది.

ఆ బొమ్మ నా దగ్గరగా వచ్చి నిలబడింది. ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలలో భవిష్యత్తుపైన అచంచలమైన విశ్వాసం కనిపించింది నాకు. ఆమె తన జీవితాన్ని వర్తమానంలోకన్నా భవిష్యత్తులోని మరొక కోణంలో చూసుకుంటోంది.

మామయ్య, పార్వతిని నా కిస్తానన్న ధైర్యంలేక ఇతర సంబంధాలు చూడటం, బాబాయి పైపోటిగా సంబంధాలు తేవటం, నా పెళ్లి—ఒక్క టొకటిగా కనులముందు మెదిలినయ్.

నాకు తెలీకుండానే ఉద్రేకం వచ్చింది.

"పారూ ...." అని పిల్చాను. ఆ బొమ్మ మౌనంగా తన స్థానంలో నిలబడింది.

తెలివితెచ్చుకుని చుట్టూ చూశాను. ఎవరూ లేరు నల్లని యోగమాయలాంటి చీకటి అలుము

39 చూడండి

చేసి ప్రతి అణువుని వెదకి నిరాశతో వెనక్కి తిరిగింది.

ఈ ఏకాంతాన్ని భరించలేను. కాదు. ఈ అన్యాయం ఇంకా చేయలేను.

వెనక్కి తిరిగి బయలుదేరాను. కాని రేపు ఆఫీసు—ఇది గుర్తురాగానే నాలో చెలరేగిన క్షణికోద్రేకం దిగజారిపోయింది.

* * *

"బాబుగారూ, భోజనం తెచ్చాను" అన్నాడు సీను.

"అదేమిట్రా, మీ అక్కయ్య ఏది? ఈరోజు రాలేదేం?" అన్నాను.

"మా బావ సినిమాకు తీసుకుపోయిండు" అన్నాడు వాడు సిగ్గుపడుతూ.

సూటిగా ప్రశ్న వచ్చి గాలంవేసింది ఎదకు. ఈ ప్రశ్న చాలా తీక్షణమై అంతఃకరణాన్ని మెలిపెట్టివేసింది.

"సీనూ, మీ అక్కా, బావ ఎట్లా ఉంటారు?" అన్నాను; నా ప్రశ్నకి జవాబు తెప్పించుకోటానికి.

"అదేమిటి బాబు?" అన్నాడు. బహుశ వాడికర్థమై ఉండదు నా భావం.

"అంటే మీ బావ మీ అక్కయ్య నెట్లా చూస్తాడు!"

"బలేవోరండి! మా బావ ఇప్పుడు బాగువడ్డాడండి. తాగడు. మా అక్కని దేవతంటాడు. బలే మారిపోయాడు!"

"మరి మీ అక్క?"

"అక్కకి బావ దేవుడండి. అదే అంటది. ఆడు లేకుంటే ఇది బతకదంట!" అన్నాడు వాడు.

"వాడు కుంటివాడు కాదుట్రా!"

"కాదుండి మరి! ఆడు సేసిన పనికి నా కొల్లి మండుద్ది బాబుగారు. కాని ఈ అక్కే అన్ని ఏమన్నీదు. ఆడు దేవుడంట. ఆడికి సేవ సేస్తూ ఉంటానంటది. అప్పట్నుంచి ఈడు మారిపోయిండు" అన్నాడు సీను.

సమాధానం రాని ప్రశ్న నా గుండె లోతులను వెదుకుతున్నది.

"సీనూ, ఈ బొమ్మ ఎవరు వేశారు?" అన్నాను.

"నేనేనండి!" అన్నాడు వాడు సిగ్గుపడుతూ వెళ్ళిపోతూ.

రాత్రి చాలసేపు నిద్రపట్టలేదు. కనులు తెరిచినా మూసినా పార్వతి కనిపిస్తోంది. రెండు మూడుసార్లు ఒంటరిగా పార్వతి నా దగ్గరకి నడచి వచ్చి ఏడుస్తున్నట్లు అనుభూతి పొందాను. ఈ రాత్రి మహా భయంకరమైనది. నా గత స్మృతులను ఒక్కసారి మేల్కొలిపింది. సడిలేని నడిరేయి నాలోని అంతర్వేదనకు ఎక్కడో కొన్ని వందల మైళ్ళ దూరంలో ఉన్న పార్వతికి వంతెన నిర్మించింది. పార్వతిమీద ఎంతో జాలి కలిగింది. చేయని నేరానికి శిక్ష అనుభవిస్తున్నది. ఈ మాటలు పదేపదే ధ్వనించగానే నా గుండె తరుక్కుపోయింది. మొదటిసారిగా కన్నీరు వచ్చింది.

ఈ దుఃఖానుభవం విచిత్రమైనది. ఈ అనుభవానికి ఆద్యంతాలు లేవు. జరామృత్యువులు లేవు. అది ఏక పథగామియై హృదయాంతరాళాల్ని తొలుచుకుని పోతున్నది.

పార్వతిని తీసుకొస్తే బాగుంటుం దనిపించింది. కాని బాబాయి ఊరుకోడు. కోడలనైనా చూడకుండా కమల కాపరాన్ని చెడగొడతాడు. కమల మా మేనమామ కూతురు. తల్లీ, తండ్రీ లేరు. అమ్మ పెంచి పెద్దదాన్ని చేసింది. చెల్లెళ్ళెవరూ లేకపోయినందువలన ఏమో కమల చెల్లెలే అనిపించింది. స్ఫటికంలా స్వచ్ఛమైన మనసు కమలది. అలాంటి కమలను చూస్తూ చూస్తూనే నే నెలా అన్యాయం చేయగలను? అయినా బాబాయిది మంకుపట్టు!

కాదు, ఇది నా బలహీనత. నాన్న పోయినప్పటి నుంచి బాబాయి మా వ్యవహారాలన్నీ చూసేవాడు. మొదటినుంచి బాబాయికి మామయ్యమీద కోపంగానే ఉంది. అందుక్కారణం ఏమిటో ఎవరికీ తెలీదు. నేను బాబాయి శిక్షణలోనే పెరిగాను. చిన్నప్పటినుండి నాలో బలహీనతను పెంచుతూ వచ్చాడు బాబాయి. ఆ బలహీనతే నా ఈ స్థితికి కారణం! అయినా ఈ బలహీనతను పోగొట్టుకోలేకపోతున్నాను.

నాలోని శాంతిని భగ్నం చేసింది ఈ రాత్రి. లేచి కూర్చున్నాను.

భిన్నాభిన్నమై అణువుల రూపంలో మంచు బిందువుల్లా జారిపోతున్నాయి కాలబిందువులు. ఈ వియోగాన్ని భరించే శక్తి లేదు నాలో. ఇవ్వాళ ఎందుకో ఇలా అనిపించింది. దుఃఖ బడబానలంతో హృదయం దగ్ధమౌతున్నది. భరించలేని నీరసం నన్నావరించింది. మనస్సు శకలాలయిపోయింది. తల తిరిగిపోయింది.

ఈ ఏకాకిత్వం చాల విచిత్రమైనది. ఇలాంటి అనుభవాన్ని జీవితంలో ఇదే మొదటిసారి పొందటం.

జీవితంలో అర్థంకానిది, నే నర్థం చేసుకోలేనిది ఏదో ఉంది. అర్థంలేని ప్రహసనంలాంటిది నా జీవితం. క్షుద్ర దీపంముందు చలించే నీడలాంటిది నా జీవితం.

నా హృదయస్పందన హెచ్చయింది. గతంలోని సంఘటనలు, శక్తులు నన్ను ఏదో తెలియని లోకానికి తీసుకుపోతున్నయి. నాకు భవిష్యత్తు కూడ అంధకారమయంగానే కనిపించింది. పార్వతి నా చుట్టూ ఏదో వలయాలు సృష్టించింది. ఇవి నన్ను బంధించినయ్. ఈ అయిదు సంవత్సరాలు ఏకాకిగానే కాలం గడిపాను. ఈ కొంత కాలంలో నే ననుభవించిన 'ఆనందము' ఎవ్వరితోనూ చెప్పుకోలేనిది.

ఆ గదిలో కూర్చోటం కూడ కష్టమైంది నాకు. ఈ రాత్రి ఎలా దొంగతనంగా నా జీవితంలో నిలీనమైపోయిందో? దీన్ని నా జీవితంలోంచి కత్తిరించివేయగల శక్తి నాకే ఉంటే? నా జీవితం పునరావృతమైతే ఎంత బాగుండును? ఏ బలహీనత వలన నే నిలాంటి అన్యాయం ఒక స్త్రీ జీవితానికి చేశానో, ఆ బలహీనతని రూపుమాపుకుంటాను. మా ఇద్దరిమధ్య ఏర్పడిన ఈ అగాధానికి వారధి నిర్మించే శక్తి నాలో లేదు! ఈ స్వయంకృతాపరాధానికి నన్ను నేను శిక్షించుకోక తప్పదు.

తలుపు తాళంవేసి బయలుదేరాను.

బయట సన్నగా తుంపర పడుతున్నది. రాత్రి చీకటిదీపాన్ని వెలిగించుకుంది. వల్లని వెలుగు అలుముకుంటున్నది.

నడుస్తూనే రెండు విచిత్రమైన సంఘటనలను చూశాను. ఈ సంఘటనలు నాలో ఆశ్చర్యాన్ని రేకెత్తించినయి. నా గది ప్రక్కనే వెంకన్న గుడిసె ఉంది.





"రా మావా బువ్వ తిందువుగాని" అంటున్నది ఎంకి.

వెంకన్న రిక్షా అక్కడే పెట్టి లోపలికి వెళ్ళి పోయాడు. వారి సంభాషణ నిశ్శబ్ద వాతావరణాన్ని దూసుకునివచ్చి నాకు స్పష్టంగా వినిపించింది. అప్రయత్నంగా నిలబడిపోయాను.

"ఇయ్యాల శానా డబ్బు లొచ్చినయ్యే ఎంకి. నీకు గాజులు తెచ్చినా—"

"నాకు గాజు లెందుకు మావా! నీకు పంచలు లేవుగా—" అన్నది

# గోడమీద బొమ్మ

"పంచలకేంలేదమ్మా, శానా వున్నయి—" అన్నాడు వెంకన్న నవ్వుతూ.

నేను నిల్వలేక పోయాను. ఎంకి ఎలా ఉంటుందో నాకు తెలుసు. వెంకన్న ఎలా ఉంటాడో తెలుసు. కాని వా రిద్దరిలో ఒకరిమీద ఒకరికి ఎంతో ప్రేమ ఉన్నది. ఏమిటి దీనిక్కారణం?

ప్రక్కవీధి తిరిగాను. నా ముందు మరో జంట నడుస్తున్నారు. ...

నాముందు ప్రవేశపెట్టిందా?

"నిజమేనే సుబ్బి, ఉన్నాడు మావాళ్ళ మాటిని విన్ను ఏలుకోపోయినట్లయితే ... నా వసుండేది నూడు—"

"ఎందుకు మావా ఆ మాటలన్నీ—"

... సుబ్బులు, దాని భర్తను. వాడు సుబ్బులుమీద ... కుంటుతూ.

"ఎందుకేటి? నేపోతే ఇప్పుడు ... వారు నూస్తారు? ... వారు ..."

అన్నాడు వాడు.

వాడి గొంతులో జీర పలికింది

"ఊరుకో బావా, వాళ్ళి నువ్వు, నీకు నేను ఉండగా ఏదో ఇట్లా గడిచిపోనీ" అంది వాడి కళ్ళనీళ్ళు తుడుస్తూ సుబ్బులు

దాని ఆత్మవిశ్వాసానికి నాకు ఆశ్చర్యమేసింది. వాళ్ళలో లేనిది వీ రిద్దరిలో ఏదో ఉన్నది అది బాహ్య సౌందర్యాని కతీతమైంది హృదయ దౌర్బల్యపు గట్టు కావలగా ఉంది వారికి తెలీకుండానే వారి హృదయాంతరాళాల్లో వెల్లివిరిసే ప్రేమను, ధైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని ఈ చీకటిలో నేను దర్శించాను. ఏదో మహత్తర సత్యాన్ని కనుక్కున్నంత ఆనందం కలిగింది నాకు

ఈ దర్శనంయొక్క ప్రభావం తీవ్రమైనది. ఈ సత్యం మనస్సులో మెదలగానే కార్యరూపం ధరించింది ఈ ఒక్క రాత్రిలో నాకింత ధైర్య మెలా వచ్చిందో నాకే తెలియదు

మరునాడు లక్ష్మణరావు నా గదికి వచ్చాడు. నా అన్వేషణని గురించి వాడితో చెప్పాను.

"అవును బ్రదర్, నువ్వు వెళ్ళి పార్వతిని తీసుకురావటమే మంచిది. వెళ్లిరా !" అన్నాడు నా భుజం చరుస్తూ. ఒక్క క్షణం పాత బల హీనత సన్నావరించింది మళ్ళీ.

"కానీ .... "

"కాని లేదు, అర్ధణా లేదు—చూడు మూర్తీ, నువ్వెంతో త్యాగం చేశావు. నీ ఆదర్శాన్ని చేతల్లో చూపెట్టావు. కాని ప్రయోజన మేమిటి ? నీ త్యాగానికి ఫలిత మేమిటి ? ఒక స్త్రీ హృదయంలో నీవు దుఃఖాన్ని సృష్టించావు. అంతేనా ! ఎవరికో జడిసి నీ త్యాగానికి హద్దు లేర్పరచుకుంటావా ? అది బలహీనత—" అన్నాడు.

నిట్టూర్చాను.

"ఎంతో అందమైన దేవాలయంలో దేవుని విగ్రహం లేకపోతే దేవాలయంగా దానికి ఎంత విలువ ఉంటుందో, నీ జీవితంలో ఆమె లేకపోతే అంతే విలువ ఉంటుంది మూర్తీ! ఆమె లేనిది నీ కస్తిత్వమే లేదు. పవిత్రమైన మంత్రాలు మీ ఇద్దరి జీవితాలను కలిపి ముడివేసినయి. దాన్ని ఎవరూ విప్పలేరు. ఒకే బాటమీద మీ రిద్దరూ ప్రయాణం చెయ్యాలి ! ఇది ఒక అన్వేషణ ! ఆరాధన. నిజానికి ఆరాధింపబడటంలోకన్నా ఆరాధించటంలో గొప్పతనముంది మూర్తీ ! నువ్వు రచయితవి. నీవో రాస్తావు. కాని ఆ భావాలలో కొన్నిటినైనా చేతలలో చూపించు—" అన్నాడు వాడు నా భుజం తడుతూ.

నేను అప్పటికప్పుడే పంచి సర్దేసుకున్నాను. నా ఈ ప్రయాణం ఎవరికీ తెలీదు. శలవు పొడిగించమని ఆఫీసర్‌తో చెప్పి బయలుదేరాను.

"వెళ్లిరా మూర్తీ ! నీవు వచ్చేసరికి మా ఇంటి ఎదురుగావున్న పోర్షను మాట్లాడివుంచుతాను." అన్నాడు స్టేషను ప్లాటుఫారంపై నిల్చుని. నేను తలూపాను ధైర్యంగా. నాకిప్పుడు ఎంతో సంతోషంగా వుంది. నేను ఒక మంచిపని చేస్తున్నాను.

* * *

నా రాక వాళ్లింట్లో ఎంత ఆశ్చర్యం కలిగించిందో నేను చెప్పలేను.

పార్వతిని తీసుకువెళ్ళటానికి వచ్చానని చెప్పేసరికి వాళ్ళకి ఆనందం కలిగింది.

"రాననుకున్నాను." అంది ఏడుస్తూ పార్వతి.

"ఎందుకు రాను" అన్నాను.

"ఈ అభాగ్యురాలిమీద ఇప్పటికైనా దయ కలిగింది." అంది ఏడుస్తూనే.

ఆమె నెలా ఓదార్చాలో నా కర్థంకాలేదు. స్త్రీని దుఃఖంనుంచి విముక్తురాలి నెలా చేయాలో నాకు చదువుల్లో చెప్పలేదు.

"ఊరుకో పార్వతీ, ఇది ఆనందించవలసిన సమయం ! నే నెప్పుడూ నీవాడినే. నీకు వచ్చిన భయం లేదు." అన్నాను.

మండువేసవిలో మలయానిలాన్ని, మలయానిలంలో మండువేసవిని—ఈ రెండింటిని స్త్రీ హృదయంలో దేవుడు పదిలపరిచాడనిపించింది.

నాలుగురోజుల తర్వాత పార్వతితో బయలుదేరాను.

"సాధ్యమైనంత త్వరలో ఆ డబ్బు అందేట్లు చూస్తాను నాయనా! ఎంత ప్రయత్నించినా ఇప్పుడు దొరకలేదు." అన్నాడు మామయ్య దీనంగా నిల్చుని.

పెళ్ళినాటి ఉత్సాహం ఈ రోజు పార్వతిముఖంలో వెలిగింది.

నేను నవ్వి ఊరుకున్నాను. మూర్ఖులు మూర్ఖులుగా ఈ సంసారాన్ని ఈదుతూ ఎన్నియుగాలు కూడబెడితే నాలుగువేలు అవుతుంది ?

నే నింటికి పార్వతితో వచ్చేసరికి లక్ష్మణరావన్ని ఏర్పాట్లుచేశాడు. నిజానికి వాడికి నే నెంతైనా కృతజ్ఞుణ్ణి. వాడి ఋణం నేను తీర్చుకోలేను.

పార్వతిని తీసుకొచ్చినట్లు అమ్మకి ఉత్తరం వ్రాశాను.

ఆ సాయంకాలం ఆఫీసునుంచి తిరిగివస్తూ గోడ వంక చూశాను. కాని ఆ గోడ కూలిపోయింది.

"బాబుగారు—" అంది సుబ్బులు ఏడుస్తూ.

వెనక్కితిరిగి చూసి "ఏమయింది ? ఎందు కేడుస్తున్నావు ?" అన్నాను.

"మా సీనుగాడు పోయిండు బాబు !" అంది పెద్దగా ఏడుస్తూ.

"సుబ్బులు !" అరిచాను. నా మనస్సులో ఏదో బాధ తలుక్కున మెరిసింది.

"ఎలా పోయాడు ?"

"ఈ గోడమీద బొమ్మేయబోయిండు. అది కూలింది—వోడు......"

ఈ మాటలు వింటుంటే నాకే గుండె తరుక్కుపోయింది. కన్నీరు ఆగలేదు.

సుబ్బులు ఏడుస్తూ వెళ్ళిపోయింది. దాన్ని నేను ఓదార్చలేను!

వాడు ఏం బొమ్మ గీద్దామనుకున్నాడో ఏ బడబాగ్ని జ్వాలలు రగిలి వాడు ఆ నల్లని బొమ్మవేశాడో? ఇది శేషప్రశ్న. కాని ఆ బొమ్మే ఒక స్త్రీ కాపురం చక్కదిద్దింది. ఆ బొమ్మే ఒక మానవుని హృదయంలో సత్యాన్ని మేల్కొలిపింది. మానవత్వాన్ని నింపింది. ఆ బొమ్మకు ఏ బహుమతులు రావు. ఎవ్వరూ మెచ్చుకోరు ఆ బొమ్మను చూసి. ఆ బొమ్మ ఎవరు వేశారనే ప్రశ్నకూడా రాదు. కాని ఆ నల్లనిబొమ్మ తన గీతలలో ప్రాణప్రతిష్ఠ చేసికుని నా దగ్గరగావచ్చి నిలబడింది. నేను సీనుకు శాశ్వతంగా ఋణపడి వున్నాను. మలుపులు తిరుగుతున్న తలపులతో వెళుతూ వెనక్కి తిరిగి చూశాను. శిథిలమై కూలిన కుడ్యంపై అస్పష్టంగా వెలుగుతున్న ఆ బొమ్మ తృప్తిగా నవ్వినట్లు నా కనిపించి నా గుండెలో శాశ్వతంగా ముద్రించుకుపోయింది.

★

తం్రడితో ఈ సంగతి చెప్పాడు. త్వరలోనే పోలీసులు (బ్రెయున్‌ని పట్టుకున్నారు. కొండ పరియలో పొదలు దట్టంగా ఉన్న ఒకచోట పడుకుని ఉన్నాడు. తనకోసం వేట తీ్రవంతగ్గేవరకూ అక్కడే ఉండిపోదామని అనుకున్నాడుట.

గడ్డం పెంచాడు. ఎండకి చర్మం ఎ్రరబడింది. ఆరు బయట నిద్రపోయినప్పటికీ ఆరోగ్యం బాగానే వుంది.

(బ్రెయున్ పట్టుపడ్డాడని వినగానే నేను షీర్‌నెస్‌కి వెళ్ళాను. పోలీస్‌స్టేషన్‌లో అతన్ని (ప్రశ్నించి చూశాను. రోజ్‌మురియల్ ఆట్‌కిన్స్ హత్యకి ఎరెస్టు చేస్తున్నామని చెప్పాను. (బ్రెయున్ వెంటనే ఒక 'స్టేట్‌మెంట్' ఇచ్చాడు. ఇంచుమించు హత్యా నేరం ఒప్పుకున్నట్లే ఉంది, ఈ 'స్టేట్‌మెంట్'. అతనినిగురించిన సాక్ష్యంచాలా బలంగా ఉంది కనుక ఇంతకన్నా చేసి ఉండలేడేమోకూడా! (రోజ్ ఆట్‌కిన్స్ చేతి సంచిమీద (బ్రెయున్ వేలిము(ద దొరికింది.)

"నిజం చెబుతాను. అదేమంచిది," అన్నాడు (బ్రెయున్ నాతో.

ఈ మాటలు అన్నప్పుడు మా్రతం మనిషి స్థిమితం కోల్పోయినట్లు కనిపించాడు. చేసిన పనికి పశ్చాత్తాప పడుతున్నాడేమోననికూడా అని పించింది. ఆ తర్వాత ఎప్పుడూ నవ్వుతూ, హుషారుగా ఉండేవాడు.

'— ఆ అమ్మాయిని కొన్ని నెలల(కితం కలిశాను', అని చెప్పుకుంటూ వచ్చాడు. 'మొత్తంమీద నాలుగుసార్లే చూశాను. ఆమెపేరు రోస్‌అని మా్రతమే తెలుసు. బుధవారం రా్రతి రోడ్డుమీద నడిచివెడుతూంటే నా వాన్‌లో ఎక్కించుకున్నాను. నా పక్కనే కూర్చుని, 'డబ్బుకి ఇబ్బంది పడుతున్నాను. సహాయంచెయ్యి' అంది.

'—నాదగ్గరేముంది ?' అన్నాను.

"ఇవ్వపోయినట్లయితే ఇలా వేళకానివేళ వాన్‌లో తిరుగుతున్నావని మీ కంపెనీవారికి రిపోర్టుచేస్తా,' నని బెదిరించింది.

'పిచ్చి వేషాలు వెయ్యక అన్నాను.

—నా పేరు జార్జి (బ్రెయున్‌అని ఆమెకి తెలుసు. ఒక దెబ్బవేశాను. వెంటనే అరవటం (ప్రారంభించింది.'

(ఇక్కడ (బ్రెయున్ నేరస్థులలో చాలామంది చెప్పే అబద్ధం చెప్పాడు.)

—ఆ పైన ఏమిజరిగిందో గుర్తులేదు. కారు స్టార్టుచేసే హేండిల్‌తో కొట్టడం జ్ఞాపకం. నా వేలు తెగినట్టుకూడా గుర్తు. నాకు వళ్ళు తెలిసే సరికి ఆమెదేహం వాన్‌లో కనిపించింది. అలాగే కొంతదూరం వెళ్ళి, కుడి వైపుగా గావును తిరిగి, రోజ్ శవాన్ని ఒక(ప్రక్కగా పడేసి, ఇంటికి వెళ్ళి పోయాను.

మా అమ్మానాన్న లిద్దరూ 'ఎక్కడికి వెళ్ళా'వని అడిగారు. కారుఆగిపోయి ఆలస్యం అయిందని చెప్పాను. మర్నాడు పొద్దునలేచి వాన్‌లోపల నీళ్ళతో కడిగాను. (ఫ్లాస్క్‌ని తీసుకుని పనిమీద వెళ్ళాను. కడగటానికి ఉపయోగించిన పీలికలను పె్రటోబులో వానబెట్టి తగలబెట్టాను.

ఆ అమ్మాయి చేతిసంచి తెరిచాను. నాలుగు షిల్లింగ్ లున్నాయి. వాటిని జేబులోవేసుకుని సంచి దాచేశాను. వాన్‌లో ఒక కత్తి ఉంది. అది గుడ్డ పీలికలకి తగిలి నెత్తురు అంటుకుంది. కంపెనీ డబ్బుతీసుకుని ఆఫీసువారితో ఇంటివద్ద మర్చిపోయానని చెప్పాను. ఆ డబ్బంతా తీసుకుని వింబుల్‌డన్‌లో జరిగే కుక్కలరేసులోపెట్టి పోగొట్టుకున్నాను.'

(బ్రెయున్ తన కథ ముగించాడు. నాకుమా్రతం రోజ్ ఆట్‌కిన్స్ అతన్ని బెదిరించిందంటే నమ్మకం కుదరలేదు. డబ్బు కుక్కల పందేలలో పోయిన తర్వాతనే రోజ్ ఆట్‌కిన్స్‌ని కలిసి ధనంకోసం ఆమెను చంపిఉంటాడని నా అభి(ప్రాయం. ఆమె గాయాలు పరీక్షిస్తే కత్తిపల్ల ఏర్పడ్డటున్నాయి. కాని, పాపం, (బ్రెయున్‌కి నాలుగు షిల్లింగ్‌లకన్నా దొరకలేదు.

విచారణ జరిగినంతకాలమూ (బ్రెయున్ ఉల్లాసంగానే ఉన్నాడు. కోర్టుకి తీసుకుపోతూఉంటే నన్ను కిటికీ అద్దం ఎత్తమని అడిగాడు. చిరునవ్వుతో, "అప్పుడేనా మెడకి చలి తగలటం మంచిది కాదని వప్పుకుంటారా?" అన్నాడు.

జూరీవారు సరిగ్గా పదిహేను నిముషాలలో (బ్రెయున్ నేరస్థుడని తేల్చేశారు.

జడ్జి నల్లటోపీ పెట్టుకుని మరణశిక్ష విధిస్తున్నప్పుడు కూడా (బ్రెయున్ నవ్వుతూనే కనిపించాడు. ఉరితీసేందుకు మూడు వారాలు గడువు ఉండిపోయిందికాని, ఎప్పుడూ (బ్రెయున్ విచారంగా కనిపించలేదు. జయిలర్లతోనూ, వార్డర్లతోనూ చివరకి తనని ఉరితీసే మనిషితోనూ సరసాలాడుతూ ఉండేవాడు. అతన్ని ఉరితీసినరోజు అతని తల్లి పుట్టిన రోజు. ఇది కూడా అతని నేనిధంగానూ కలవరపరచలేదు.

ఒక్క విషయంమా్రతం (బ్రెయున్‌కి తెలియదు. రోజ్ ఆటోకిన్స్‌కి చాలా (ప్రమాదకరమయిన జబ్బు పట్టుకుంది. (బ్రెయున్ హత్య చెయ్యకపోయినా, కొన్ని నెలలలోనే ఆమె ఈ వ్యాధితో చనిపోయి ఉండేది.



# కథ-సినిమా కథ

22-వ పేజీతరువాయి

కనిపిస్తూంది—భయం, ఆనందం, ఆశ్చర్యం ..... అన్నీ మిళితం ......

ఆ క్షణంలోనే ఇద్దరూ 'సారీ' అంటారు. పందెం వేసుకున్నట్టుగా పుస్తకాల కోసం కిందకు వంగుతారు. మళ్ళీ ఓసారి మొహాలు ఎదురు పడతాయి. అప్పుడు ఆ చూపుల్లో, '(ప్రేమ' మనకు కొట్టొచ్చినట్టు కనుపిస్తుంది. ఆ అమ్మాయి ఓ క్షణం అలాగే చూసి సిగ్గు పడుతూ గబుక్కున ఓ కార్డు, పుస్తకాలూ తీసుకుని చకచక, నడిచి వెళ్ళిపోతుంది. హీరో ఆ అమ్మాయి వైపు చూస్తూ, ఓ క్షణం గడిపి పుస్తకాలు తీసుకోబోతుంటే గబుక్కున గాలి వస్తుంది. కార్డు తిరగబడుతుంది. తన కళ్ళను నమ్మలేక పోతాడు. ఆ కార్డుని అలాగే పుచ్చుకు ఫోటో వైపు చూస్తూ, (కింద 'సురేఖ' అనే పేరు చూస్తూ పుస్తకాల విషయం మర్చిపోయి వెళ్ళి పోతాడు. (అప్పుడు అర్థమవుతుంది—ఆ పుస్తకాలు కేవలం ఫోటోలు పట్టుకురావడం కోసమే నని.)

ఇక ఆ అమ్మాయి ఇంటికెళ్ళి బుద్ధిగా పుస్తకాలు తిరగవేస్తుంటుంది. ఆ పుస్తకాలలో తన ఫోటో బదులు మరో—ఫోటో ఉంటుంది. కింద "శేఖర్" అని కూడా (వ్రాసి ఉంటుంది. ఎవరూ ఈ ఫోటో అన్నైనా ఆలోచించకుండా ఆ ఫోటో లోని అన్ని ఏంగిల్సులోనూ చూస్తూ విరహగీతం ఆరంభిస్తుంది. అదే వరుసలో దానికి కంటిన్యూవిషన్‌లా హీరో కూడా పాట అందుకుంటాడు తన ఇంటిదగ్గర.

మర్నాడు ఏదో వింత శక్తి వాళ్ళిద్దర్నీ మళ్ళీ అదే సమయానికి బృందావనంలోనే కలుపుతుంది... అదే (ప్రణయంగా మారుతుంది. ఓ నాలుగు డ్యూయెట్లూ, రైలు డబ్బాలమీదా, బస్సుల్లోనూ, పడవల్లోనూ, ఇక్కడా అక్కడా అనకుండా అన్ని జనసమర్దమైన (ప్రదేశాల్లోనూ—ఇలాగ సాగి పోతూంది; ఇంటర్‌వెల్ దాకా.

(అక్కడనుంచి కథ ఎలా సాగుతే బాగుంటుంది—అంటే ఎలా అయినా ఒకటే—కాని ఈవిధంగా ఉంటే బాక్సాఫీస్ హిట్ అనుకుంటారు.)

ఇంటర్‌వెల్ తర్వాత సినిమా మొదలయ్యేసరికి బస్ స్టాప్‌లో సురేఖ నిల్చుని ఉంటుంది. పక్కన ఇద్దరు ముగ్గురు చెలికత్తెలు—వాళ్ళకు కొంచెం దూరంలో 'ఆనంద్' అనే శేఖర్—స్నేహితుడు తన స్నేహితులతో ఉంటాడు ..... ఆ ఆనంద్' మన సినిమాలో కమేడియన్‌గా ఉంటాడు.

అంతలో ఓ పువ్వులమ్మి పసందుగా తయారై వచ్చి నడిరోడ్డుమీద డ్యాన్సు చేస్తూ "పువ్వులండీ పువ్వులు .... రంజైన పువ్వులు .... (ప్రేమికులను దరిచేర్చు పసందైన (ప్రేమపువ్వులు" లాంటి పాట పాడుతూంటుంది. పాట పూర్తయేదాకా ఉండి ముందరకు వచ్చి ఓ సూటుతో వున్న వ్యక్తి—ఎంత ఇస్తున్నాడో కూడా లెక్కచెయ్యకుండా జేబులోంచి డబ్బులు తీసిచ్చి ఒక్కటే 'గులాబీ' తీసుకుంటాడు.

ఆనంద్ అతనివైపు చూస్తాడు. శేఖర్.. లేక పోతే వాడితోపాటే పుట్టిన తమ్ముడు ఖర్ ! ? ఎవరై ఉంటారూ ? అని ఆలోచిస్తాడు (శేఖర్, ఖర్ కవలపిల్లలని గమనించాలి)

ఆ సూట్‌వాలా ఆ గులాబీని తీసుకుని చకచక నడచి వెళ్ళి సురేఖకు ఇస్తాడు....సురేఖ ఏంచేస్తుందో కూడ మర్చిపోయి ఆ పువ్వు విసరేసి— చెంపమీద చెళ్ళున కొడతుంది.....అక్కడ వున్నవాళ్ళందరూ నిర్ఘాంతపోతారు.... ఆనంద్ అందరికంటె ఎక్కువగా క్వెశ్చన్‌లో ఆశ్చర్యపోతాడు. వెంటనే అనుకుంటాడు. వచ్చినవాడు 'ఖర్' అయ్యేవుంటాడని—అతని విషయం సురేఖకుకూడా తెలుసునని.

వెంటనే 'ఆనంద్'కి ఓ చిన్న సన్నివేశం జ్ఞాపకం వచ్చి 'శేఖర్ సురేఖకు గులాబీలు ఎప్పుడూ ఇవ్వడు—ఆమెకు గులాబీలంటే అయిష్టం— అందుకని ఆ విషయం తెలియని 'ఖర్' ఆమెకు గులాబీ ఇచ్చి వుంటాడు అని.....అతనికి జ్ఞాపకంవచ్చిన సన్నివేశం మనకు ఫ్లాష్ బ్యాక్‌లో కనుపిస్తుంది.

* * *

సురేఖా, శేఖరూ (ప్రేమలోపడ్డ కొత్తరోజుల్లో

## కత - సినిమా కత

బీచిలో అలసిపోయేదాకా డ్యూయెట్ పాడి....శేఖర్ "నీ కోసం నేను ఏం తెచ్చానో చూశావా ! ఎఱ్ఱ గులాబీలు—పువ్వులాంటి హృదయం గల నీకు ఇంతకంటె ఏం ఇవ్వను ! ? " అంటూ పువ్వులు ఇస్తాడు.

"గులాబీలా.... అసలు ఆ వాసనే నాకు కిట్టదు. నా కొద్దు...." అని తనమొహం తిప్పేసుకుంటుంది.

"పోనీ— నీ కేం కావాలి— (సు)రేఖా.... ఏం కావాలన్నా తెచ్చిస్తాను."

"సంపంగిలంటే నాకు ప్రాణం....."

"అయితే ఇదే చెబుతున్నాను....ఇకమీద.... గులాబీలు ఇచ్చి నీ మనస్సు ఎప్పుడూ నొప్పించను... ఎప్పుడూ సంపంగిలే ఇస్తాను...." అని శపథం చేస్తాడు అనుకోవాలి...ఇదంతా ఆనంద్ చూస్తాడు.





(గులాబీలు అంటే అయిష్టమైన అమ్మాయిలు వుంటారా! ? గులాబీలు ఇస్తే మనస్సు కష్టపెట్టడ మవుతుందా అన్నవి మనం ఆలోచించ కూడదు.) [ఫ్లాష్ బ్యాక్]

* * *

ఆనంద్‌కు అనుమానం వస్తుంది శేఖర్‌కి, ఖర్ ఏమైనా ప్రమాదం తలపెట్టాడేమోనని.... అసలే 'ఖర్' పరమ దుర్మార్గుడు. తేనె పూసిన కత్తి.... ఆలోచిస్తూ ఖర్ ఎక్కబోతున్న కారుదగ్గరకు వచ్చి ఎవరూ చూడకుండా కారు డిక్కీలో కూర్చుంటాడు. ఖర్ తనకు కలిగిన అవమానానికి కోపంతో వచ్చి కారులో కూర్చుని డ్రైవ్ చేసుకు వెళి పోతాడు. ఖర్‌కి వచ్చిన కోపంకంటే ఎక్కువ కోపంతో కారు వూరి చివర కొండల మధ్యలోవున్న రహస్యమైన గోడౌన్‌లాటి బంగళా చేరుతుంది. 'ఖర్' చకచక నడిచి లోపలికి నడుస్తాడు. ఆనంద్ ఆ గోడపక్కనా ఆ గోడపక్కనా దాక్కుని ఖర్‌తోపాటు బంగళాలో ప్రవేశిస్తాడు. లోపల బోలెడన్ని పీపాలు కనుపిస్తాయి. (చివరి సీనులో యుద్ధంకోసం అని మనకి అర్థమవుతుంది) గళ్లలుంగీలు కట్టుకున్న రౌడీలు కొందరూ, పువ్వుల—బుష్‌కోట్లు వేసుకున్న రౌడీలు మరికొందరు నిషాలో కూర్చుని పేక ఆడుతున్నారు.

వాళ్ళు కూర్చున్న కుర్చీలు, బల్లలమధ్య ఖాళీలో మోహిని అనే ఓ అమ్మాయి పాటపాడుతూ, డ్యాన్సు చేస్తూ.... మధ్యమధ్యలో వీళ్ళ చేతులలో ముక్క ఒకటి, వాళ్ళ చేతుల్లో ముక్క ఒకటి విసరుతూ అప్పుడప్పుడు సెన్సారువాళ్ళకు పనిచెబుతూ వుంటుంది.

(ఆ పాటల తీరు)

"రావోయి—రావోయి—నా మాటా నాపాటా
నా ఆటా వగ్గైరా వగ్గైరా అన్నీ నీవేనోయీ,
జాగుచేయక రారా నా ప్రియుడా"

అన్నట్టుంటుంది.

(పొరబాటున 'డబ్బింగ్' సినిమా అయితే— ఆ అమ్మాయి పాటకూ పెదవుల కదలికకూ— చేసే నాట్యానికీ పొత్తుకుదురుతే ఒట్టు)

పాట పూర్తయ్యేసరికి సహజంగా కళాభిమాని అయిన "ఆనంద్" ఈలవేసి చప్పట్లు కొడతాడు.

అక్కడే కూర్చున్న బొద్దుమీసాలరౌడీ "ఎవఁడ్రా వాడు" అని గర్జిస్తాడు.. ఇంతలో ఓ పువ్వుల బుష్‌కోటు రౌడీ 'ఆనంద్'ని వెదికి చేతులు వెనక్కి విరిచికట్టి తీసుకువస్తాడు.

"ఎవరు నువ్వు?" అని ఖర్ గర్జించేసరికి 'పింబాలిక్'గా డ్రింకులు పట్టుకొస్తున్న సేవకుల చేతుల నుంచి సీసాలు జారిపోతాయి. ఆనంద్ సమాధానం చెప్పకపోయేసరికి విసుగెత్తి:

"వీడినికూడా ఆ గదిలోనే పారెయ్యండి" అంటూ ఆర్డరు వేస్తాడు ఖర్.

"యస్—బాస్" అంటూ అంత మీసాల రౌడీ ఆనంద్‌ను తీసుకు వెళి పోతాడు అతి 'సిన్సియర్'గా.

పక్కనే నిల్చున్న మోహిని "అయ్యో పాపం" అనుకుంటుంది ఆనంద్‌ను కట్టిపారేసినందుకు.

ఆనంద్‌ను తొలిచూపుల్లోనే ప్రేమించింది అన్నందుకు నిర్ధారణగా రెండు కన్నీటి బొట్లు కూడా రాలుస్తుంది.

ఆనంద్‌ను కట్టివేసిన గదిలోనే శేఖర్‌కూడా ఓ స్తంభానికి కట్టివేయబడి వుంటాడు....

"ఆనంద్ — నా గురించి నువ్వుకూడా ఈ దుర్మార్గుల చేతుల్లో చిక్కావా ! ?" అంటాడు శేఖర్

బాధగా, విచారంగా ఆయాసంతో—

అంతలో ముక్కు గోక్కుంటూ! (అది ఖర్‌కి ఒక అలవాటు) ఖర్ అక్కడకు వస్తాడు. అంత అతను హింసిస్తున్నా 'శేఖర్'కు ఖర్‌మీద కోపం రాకపోవడానికి 'సోదరానుబంధం', 'రక్తపాశం' కారణమని మంచివాడైన శేఖర్‌కు తెలుస్తుంది.

"ఏం....ఎలావుంది? మర్యాదలు సాగుతున్నాయా" అంటూ అడుగుతాడు 'శేఖరు'ను ఖర్.

"తమ్ముడూ .... నాకైనా నిజంచెప్పు—నిన్న రాత్రి మర్రిచెట్టుక్రింద ఎందుకు హత్యచేశావూ? ఇప్పటికైనా మించిపోయిందిలేదు నేరం ఒప్పుకో" జాలిగా అంటాడు శేఖర్.

(అంతవరకు అంతక్రితంరోజు రాత్రి హత్య జరిగిందని మనకు తెలియదు. వెంటనే హత్యసీను మనకు ఫ్లాష్ బ్యాక్‌లో కనిపిస్తుంది....

అర్ధరాత్రి — అమావాస్య చీకటి....కారులో ఊరి బయటనుంచి శేఖర్ వస్తూవుంటాడు. పక్కనే మర్రిచెట్టుదగ్గర పిస్తోలు చప్పుడు వినిపించింది. కారు ఆపి 'శేఖర్' కిందకు దిగుతాడు. ఎదురుగ తన తమ్ముడు ఖర్ పిస్తోలుతో కనిపిస్తాడు.... పక్కనే ఓ మనిషి చచ్చిపడివుంటాడు....'తమ్ముడూ' అంటాడు శేఖర్.... 'ఖర్‌కి' ఓ క్లోజప్.... పిస్తోలు నోటి దగ్గరపెట్టుకుని ఓ క్షణం ఆలోచిస్తాడు.... వెంటనే రెండుగులు ముందుకువేసి "శేఖర్"ని తన్ని కాళ్ళూ చేతులూ కట్టి కారులో పారేసి....గడౌన్ లాటి బంగళాదగ్గరకు తీసుకువచ్చి బంధిస్తాడు.. అక్కడతో ఫ్లాష్‌బ్యాక్ అయిపోతుంది.)

"హ! హ! హత్య చేసింది నేనుకాదు.... నువ్వే" గట్టిగా నవ్వుతాడు ఖర్.

"ఏమిటి తమ్ముడూ నువ్వనేది! ?"

"అవును. నువ్వు హత్యచేశావంటే ఎవరూ నమ్మరు. నేనే చేశాననుకుంటారు.... పోనీ హత్య నేనే చేశాను అంటే 'ఖర్' అన్నమాట. ఇవాళనుంచీ నువ్వు ఖర్— నేను శేఖర్‌ను.... మనిద్దర్నీ బ్రహ్మదేవుడుకూడా పోల్చుకోలేడు...." అంటూ గట్టిగా మరోకసారి నవ్వుతాడు 'ఖర్' విలన్ కాబట్టి.

"నువ్వు ఎవర్ని మోసంచేసినా నా 'సురేఖ'ను మాత్రం మోసంచెయ్యలేవు" బాధగా అంటాడు శేఖర్.

"సురేఖ.... నన్ను చేసిన అవమానానికి ప్రతీకారం తీర్చుకుంటా చూడు. నీకళ్ళముందరే ఏం చేస్తానో మరి!" అంటూ వెళ్ళిపోతాడు 'ఖర్'.

'ఖర్' వెళ్ళిపోయాక మోహిని అక్కడకు వచ్చి ఆనంద్‌ను చూసి నవ్వుతూంది 'అదోలా'. ఆనంద్ కూడా అలాగే నవ్వుతాడు 'మోహిని'ని చూసి.... దూరంగా చెట్టుమీద పక్షిదంపతులు ప్రేమించుకుంటాయి. (దర్శకత్వ ప్రతిభ)

"నన్ను ప్రేమిస్తావా! ?" సిగ్గుగ మాటంగ అడుగుతుంది 'ఆనంద్'ను మోహిని..

జవాబు ఏం చెప్పాలో తోచక 'నా కట్లు విప్పేస్తావా! ?" అంటాడు ఆనంద్.

"నీకోసం— నా ప్రాణమైనా ఇస్తాను...." అంటుంది కట్లువిప్పేస్తూ.... మోహిని." "దుర్మార్గులనుంచి పారిపోవడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాను; అయితే చివరనిముషంలో మానుకోవల వస్తుంది" మోహినే అంటుంది ఖర్ బృందంటే తనకూ ఇష్టంలేనట్టు.

మోహిని చూపించిన రహస్యమార్గంగుండా ఆనంద్ బయటకు వస్తాడు.

(శేఖర్ ఎందుకు వెళ్ళాడూ ? ! అని అనుమానం రాకూడదు) గబగబా పోలీసుస్టేషను వైపు పరుగెత్తుతాడు....

(ఆ సీను అక్కడితో ఆగిపోతుంది)

ఖర్‌ను లెంపకాయకొట్టిన సురేఖ ఇంటికి వచ్చేస్తుంది పొద్దుటికి కాలేజీ ఎగ్గొట్టి. ఇంటి కొచ్చి ఏదోఏదో ఆలోచిస్తూ నిద్రపోయి— డ్రీమ్ సీక్వెన్స్‌లోకి జారిపోతుంది.

* * *

తెల్లటి మబ్బులాంటి పొగలు ధారాళంగా వస్తూంటాయి. గమ్యంలేని గుండ్రని మెట్లు— ఓ అందమైన చందమామ, బోలెడన్ని నక్షత్రాలు, సురేఖ శేఖర్ డ్యూయెట్— అంతలో విలన్ ఖర్ పిస్తోలుతో వస్తాడు— బోలెడంత సస్పెన్స్— శేఖర్ ఉపాయంగా ఖర్ చేతులోని పిస్తోలును విడిపించేస్తాడు. తరువాత స్టంట్.... శేఖర్ ప్రాణాపాయంలో వుంటాడు.

శేఖర్.... శేఖర్— అంటూ కేకలుపెడుతూ నిద్రలేస్తుంది సురేఖ. పక్కనే ఒక్కొక్క కుర్చీ రెండేసి సార్లు తుడుస్తున్న నమ్మకమయిన ముసలి నౌకరు "అమ్మాయిగారూ.... ఏం జరిగింది ?" అంటూ అటువస్తాడు..

---

ఇద్దరు స్నేహితులు సగలు దుకాణానికి వెళ్ళారు. అందులో ఒక డబ్బిగాడు.

"ఆ వజ్రం మనం తీసుకున్నామనుకో; ఎంత లాభం."

"ఐదేళ్లో, పదేళ్లో! అదంతా జడ్జీమీదఆధారపడిఉంటుంది లే!"

వాగమణి (మద్రాసు)

---

"పీడ—కల...." అంటుంది సురేఖ.

"పరవాలేదమ్మా—పీడ—కలలు నిజంకావు" ధైర్యం చెబుతాడు—సురేఖ తల నిమురుతూ ముసలి నౌకరు....

సురేఖ— శేఖర్ ఇంటికి బయలుదేరుతుంది దారిలో కారులో ఖర్ కనుపిస్తాడు. సురేఖను చూడగానే కారు ఆపి కళ్ళ నీళ్ళుపెట్టుకుంటూ "నన్ను క్షమించండి— వదినా— అన్నయ్య ప్రమాదంలో వున్నాడు రండి"—అంటూ కారులో ఎక్కించుకుంటాడు సురేఖను.

(ఖర్ పరమ దుర్మార్గుడని తెలిసినా, ఏమైనా చెయ్యడానికి వెనుదీయడని తెలిసినా— కేవలం తన ప్రేమకోసం— తన శేఖర్‌కోసం సీన్ నటన చూసి 'పాపం! మోసపోయింది' అని మనం అనుకునేలా మోసపోతుంది.)

ఈ లోపులో మోహిని సహాయంతో కట్లు విప్పించుకున్న హీరో 'శేఖర్'గళ్ళలుంగీల రౌడీలతోటీ పువ్వుల—బుష్‌కోటు, రౌడీలతోటి పీపాలతోనూ, కుర్చీలతోనూ యుద్ధం చేస్తూంటాడు.

సరిగా అప్పుడే ఓ చేతో సురేఖను, మరోచేతో పిస్తోలు పట్టుకుని ఖర్ అక్కడకు వస్తాడు—'సురేఖను' 'ఖర్'చేతులో చూడగానే 'శేఖర్', "సురేఖా" అంటాడు.

"శేఖర్—" అంటుంది సురేఖ. శేఖర్ రెండడుగులు ముందుకు వేస్తాడు.

"ఆగు— అడుగు ముందుకు వేశావా—సురేఖ" అంటాడు పిస్తోలు సురేఖ తలమీదపెట్టి ఖర్.

శేఖర్ ఆగిపోతాడు — మళ్ళీ రౌడీలు అతని చేతలు వెనక్కు విరగ్గట్టి పట్టుకుంటారు.

అంతలో "బాస్! పోలీసులు" అంటాడు రౌడీ పరుగెట్టుకుంటూ వచ్చి—సరిగా అదే సమయంలో ఆనంద్ పోలీసులను వెంటబెట్టుకు వస్తాడు. రౌడీలు అందరూ దొరికిపోతారు ! అయితే ఖర్ సురేఖను ఈడ్చుకుంటూ రహస్యమార్గంగుండా కారు జేరుకుని స్టార్ట్‌చేసి వెళ్ళిపోతాడు. వెనక వస్తున్న శేఖర్ రోడ్డుపక్కనవున్న మోటారు సైకిలుమీద బయలుదేరుతాడు. వాళ్ళిద్దరి వెనకాల పోలీస్‌వాన్ బయలుదేరుతుంది. వాన్ బయలుదేరిన తర్వాత పరుగెట్టుకుంటూ వచ్చి వాన్ ఎక్కుతాడు ఆనంద్....

(ఏమవుతుందో! సురేఖ తల్లిదండ్రులు మరో కారుమీద అటుపక్కకే బయలుదేరుతారు. ముసలి నౌకరు పరుగెత్తుకుంటూ అటే వెడతాడు మధ్యలో నాలుగు లారీల క్రింద, మూడు కార్ల క్రింద పడబోయి తప్పించుకుంటూను.)

ఈ విధంగా ఒకరి వెనుక ఒకరు జనంలేని రోడ్డుమీద జోరుగా సాగిపోతుంటారు. 'క్లైమాక్స్' సీన్ అదే కనుక ఆర్కెస్ట్రావాళ్ళు, మ్యూజిక్ డైరెక్టర్ 'మీఇష్టం' అంటే వాయించినట్లు వాయిం చేస్తారు...

కొండదారులంపట— పాములా మెలికలు తిరుగుతున్న రోడ్లంపట పైన చెప్పిన వాహనాలన్నీ ఎనభైమైళ్ళ స్పీడులో వెడుతూవుంటాయి.

(కావాలంటే మధ్యలో ఓ రైల్వే లెవెల్ క్రాసింగ్ పెట్టి— విలన్ కారు వెళ్ళిపోయినతరువాత—హీరో మోటారు సైకిలు వచ్చేటప్పటికి గేటు మూసేస్తే ఇంకొంచెం 'సస్పెన్స్' పెంచవచ్చు.)

కొంత దూరం పోయేటప్పటికి విలన్‌కారు చెడిపోతుంది....హీరోయిన్ని (సురేఖను) చేత్తో పట్టుకుని కిందకు దిగుతాడు ఖర్. సరిగా అదే సమయానికి శేఖర్ మోటారుసైకిలుదిగి స్టంటుచెయ్యబోయేటప్పటికి 'ఖర్' శేఖర్‌ను రాతితో బలంగా కొడతాడు శేఖర్ స్పృహతప్పి పడిపోతాడు.

'ఖర్' సురేఖను ఏటవాలుగా, కోనుగా, ఎత్తుగా వున్నకొండ చివరకు తీసుకుపోతాడు.

ఆనంద్—పోలీసులు వగైరాలు అక్కడికి వచ్చేటప్పటికి శేఖర్‌కు తెలివి వస్తుంది. అయితే ఖర్ దూరంగా స్టంట్‌కి అందకుండా వుంటాడు. పైగా 'సురేఖ' అతని దగ్గరే వుంటుంది— రాక్షసుడి దగ్గర రాకుమార్తెలా. అందరూ పోర్ట్రెయిట్ మర్చిపోయినట్టు అలాగే వుండిపోతారు.

అంతలో ఖర్ విజృంభించి "మీకు అయిదు నిముషాలు టైమ్ ఇస్తున్నాను— వెనక్కి తిరిగి వెళ్ళిపోండి — లేకపోతే 'సురేఖను' కాల్చేస్తాను" అంటాడు పిస్తోలు సురేఖవైపు గురిపెట్టి.

ఇక్కడ్నుంచి ఇక్కడ రూ—శేఖర్‌ల—చేతిగడియారాలు మనకి క్లోజప్‌లో కన్పిస్తాయి. ఓ అయిదువందల గజాలు పూర్తిగా గడియారాలు; మరో అయిదువందల గజాలు అందరిమొహాలకూ క్లోజప్‌లూ ఇచ్చి ఇదో గజం, అదో గజం కనుపిస్తూ

## కథ - సినిమా కథ

వుంటుంది మనకు— (ఈ వాక్యం ముళ్ళపూడి వారి రచనలో ఓ దానికి దగ్గరది)— ఆ అయిదు నిమిషాలు గడపడానికి పావుగంట పడుతుంది.. అయినా ఇంకా ఇరవై సెకండ్లుంది..

(భలే నస్పెన్సు: జనం ప్రాణాలుగ్గబట్టుకు కూర్చుంటారు అనుకుంటారు— సినిమా తీసే టప్పుడు).... అంతలో 'వాగిన్' మ్యూజిక్ విన్పిస్తుంది... ఓ త్రాచుపాము ఎక్కడనుంచో వచ్చి ఖర్‌ను కాటేస్తుంది. సురేఖను వదలి 'ఖర్' కిందకు దొర్లుకుంటూ పడిపోతాడు. (పాము తన పాత్రను చక్కగా అర్థంచేసుకు నటిస్తుంది.)

సురేఖ జారిపడిపోబోతుంటే శేఖర్ పరుగెట్టుకెళ్ళి ఆమెను రక్షిస్తాడు— అందరూ కిందవడ్డ ఖర్ దగ్గరకు వెడతారు. ఖర్ ఇంకా క్షమాపణ చెప్పుకోడానికి బ్రతికేవుంటాడు. తను చేసిన హత్య ఒప్పుకుంటాడు..

"అన్నయ్యా ! నన్ను క్షమించవూ !? శేఖర్ ! నన్ను, మన్నించరూ" అంటాడు ఖర్— శేఖర్— సురేఖా, ఖర్ ప్రక్కన కూర్చుంటారు.

వారి సాన్నిధ్యంలోనే 'ఖర్' కళ్ళుమూస్తాడు. తరువాత సురేఖా, శేఖర్‌ల పెళ్ళితో—ఆనంద్, మోహినిల జంటతో శుభం చూపిస్తారు. ఇలా వుంటుంది సినిమా కథ.

(సినిమా—కథలో సంభాషణలు వ్రాయాలంటే. అబ్బో చాలా కష్టం—బోలెడన్ని పేజీలు వ్రాయాలి. అందుకని అక్కడక్కడ మచ్చుకు కొద్ది సంభాషణలు మాత్రమే వ్రాయడానికి వీలయింది.)

ఇహ మిగిలింది: వాస్తవికత:

ఎలా ఉంటుంది అంటే అటువంటి సన్నివేశం చూస్తేకాని చెప్పలేం ! ఎందుకంటే ఇటువంటి సన్నివేశాలు, కథల్లో, సినిమా కథల్లో—ఊహల్లో మాత్రమే జరుగుతాయి. వాస్తవికతకూ, కథకూ, సినిమా—కథకూ ఎంత దగ్గరో చెప్పటం కష్టం! ఓ సన్నివేశం తీసుకుని — అది కథలో ఎలా వుంది అవుతుంది; సినిమా కథలో ఎలా—వుంది అవుతుంది అని వూహించి వ్రాశాం. ఇహ ఆ సన్నివేశం పరిణామం వాస్తవికతలో ఎలా ఉంటుంది!? అంటే వూహల పరదా తీసేస్తే సరి:

ఉదాహరణకు: పొరబాటునో — పోటీవేసుకునో ఓ అమ్మాయిని అబ్బాయి డేష్ ఇచ్చాడనుకోండి. కథలో మన ఊహలు.

సురేఖకు ఓ అన్నయ్య ఉండటం(ఆనంద్)—అదీ స్వంత అన్నయ్య అయితే కథకు పనికిరాదు. అందుకు పెద్దమ్మగారి అబ్బాయి క్రికెట్ మ్యాచ్‌కి ఆనంద్ రావడం— అతను శేఖర్‌కు బాల్యస్నేహితుడు కావటం— శేఖర్ తను చేసిన తప్పు ఆనంద్‌తో చెప్పుకోవడం — అలాఅలా జరిగిపోతుంది కథ.

ఇక సినిమా కథ అయితే మరీనూ.. మధ్యలో ఓ విలన్— నాలుగు హత్యలూ, మూడు కలలూ, చివరకు కథ ఏం చెయ్యాలో—తోచక పాము సహాయం అర్థించి, కథను సుఖాంతం చెయ్యడం — ఇవన్నీ ఊహలు కాదూ ! ? ఆలోచిస్తే అవి వాస్తవికతకు ఎంత దగ్గరా అని మీకే తెలుస్తుంది.

తతిమా "వాస్తవికత"మీరే పూర్తిచేసుకోవచ్చు.



"హాఁ—నబ్ ఠీక్ హై" అన్నాడు రాంసింగ్.

"ఎవరయినా మిగిలారా ?" అన్నాడు రాజా.

"ఎవరూ" అన్నాడు నాయర్

[illegible]

"భాయీ రాజా, నువ్వు కాస్సేపు పడుకో.... వేసున్నాను...." అన్నాడు నాయర్....

"వద్దులే భాయీ...." అన్నాడు రాజా....

"[illegible]"

"సరే—కానీ, జాగ్రత్త...."

అసలు గస్తీలో నిద్రపోకూడదు— నిజమే— కాని, ఆ మాట అనుకుంటూ అనుకుంటూనే కళ్ళు మూతపడిపోతాయి .... అనుకోకుండానే నిద్రపడు తుంది .... ఎప్పుడో గబుక్కున మెలకువ— తక్ష ణం చెయ్యి రైఫిల్ ట్రిగ్గర్ దగ్గర ఉంటుంది—

చావు బ్రతుకుల మధ్య క్షణం విరామం....

కళ్ళు మూసుకున్నాడు రాజా .... ఆలోచనలు— మళ్ళీ అదే కళ్యాణి తన్ను ఎంత అవమానం చేసింది !

"అలాగే అనుకుంటూవుండు..సంగతి చెప్తాను." అనుకున్నాడు రాజా.

* * *

తెలతెల్లవారింది. ముగ్గురిమీదా వెలుతురు ప్రసరించింది.... చుట్టూ చూచారు ముగ్గురూ....

రాత్రి చచ్చిన శత్రు సైనికుల శవాలు అక్కడే ఉన్నాయి.... కనీసం పదిమంది ఉన్నారు.... రెండు మెషీనుగన్నులు ఏమైపోయాయో గాని పక్క పక్కనే రెండు చిన్నగోతులు కన్పించాయి.... పారి పోయిన వాళ్ళు చనిపోయినవాళ్ళనీ దెబ్బలు తిన్న వాళ్ళనీ వదిలి పారిపోయినట్లున్నారు..

"భాయీ, వెళ్ళి చూద్దామా ?" అన్నాడు రాంసింగ్....

"సహో— నాయర్‌భాయ్— కొంచెం జాగ్రత్త" అన్నాడు రాంసింగ్ ట్రెంచ్‌లోనుంచి లేస్తూ. ఇద్దరూ బయలుదేరారు శవాలవైపు.. దాదాపు వంపగజాలుంది మధ్య... ఎడమ చేతికీ, ఛాతీకి మధ్య రైఫిల్ ఉంచుకుని, కుడిచేతి చూపుడు వేలుతో ట్రిగ్గర్‌ను పదిలంగా పట్టుకుని ఇద్దరూ నడిచారు.

చిందర వందరగా పడివున్నాయి దేహాలు.... ఒకతని తల కన్పించలేదు .... మరొకడి ముఖం నిండా నెత్తురుగడ్డ కట్టుకుంది.... మరొకతని కడుపు లోంచి ప్రేవులు పచ్చగా పక్కకు వచ్చేశాయి.... వికృతంగా, మృత్యువు పలువిధాలుగా అంతిమ విన్యాసం చేసింది వారిమీద....

"భాయీ, వీళ్ళందరికీ పెళ్ళాం, బిడ్డలూ ఉండరా ?" అన్నాడు రాంసింగ్..

"ఉంటారు—" అన్నాడు రాజా....

"కాగితాలేమయినా చూడాలా ?" అన్నాడు రాజా....

అందరి దేహాలు తడిమి, వెతికారు.... ఏమీ దొరక లేదు...

"ఏమీలేదు — పద, పోదాం...." అన్నాడు రాజా. నెత్తురు కారి, గడ్డకట్టినచోట, ఎరుపూ తెలుపూ విచిత్రంగా మెరిశాయి మంచుమీద....

"భాయీ, వాళ్ళు ఖచ్చితంగా వస్తారు మళ్ళీ" అన్నాడు నాయర్; ఇద్దరూ ట్రెంచిలో చేరిం తర్వాత ...

"నిజం...." అన్నాడు రాజా..

"ఏ తూటాల బెల్టు ఇంకా ఎంత ఉంది ?" రాంసింగ్ అడిగాడు..

"ఫరవాలేదు...." అన్నాడు రాజా.

## క్షీ రు వు

17-వ పేజీ తరువాయి

[illegible]

"ఇవాళ తేదీ ఎంత?" అన్నాడు నాయర్....

"మనం ఇక్కడికి వచ్చింది మూడురాత్రుల ముందు— పదిహేనో తేదీ— అంటే ఈరోజు పద్దెనిమిది" అన్నాడు రాజా....

"వారెవా ! ఇవాళ నా పుట్టినరోజు—"అన్నాడు నాయర్ నవ్వి .... రాజా, రాంసింగ్ — ఇద్దరూ నాయర్‌తో కరచాలనం చేశారు.

"మెనీ హేపీ రిటర్న్స్" అన్నాడు రాజా ఇంగ్లీషులో

"థాంక్స్ రాజా" అన్నాడు నాయర్ ఆనందంగా.

* * *

మధ్యాహ్నం కావస్తోంది .... ఎక్కడా అలికిడిలేదు.. వెనుక హెడ్‌క్వార్టర్స్‌నుంచి సమాచారం లేదు.... తమను అక్కడే ఉండమన్నారు.. [illegible]డయినా జనసంచారం కన్పిస్తే వెంటనే అయిదు మైళ్ళు వెనక్కిపోయి వార్త అందించాలి.. ఇంత




# ఫిలిప్స్ నోవోసోనిక్ ట్రాన్సిస్టర్ రేడియోలు

* అసామాన్య శబ్ద గుణాలు
* అధునాతనమైన సౌందర్యాలు
* విశిష్టమైన నిర్వహణ
* పూర్తిగా ఉష్ణ నిరోధకమైనవి.
* సొమ్ముకు తగిన విలువ



B5CA191
ఫిలిప్స్ రెక్సన్ కర్ర కాబినెట్
2 స్పీకర్లు 4 బ్యాండులు
రు. 645/-







4CA181
ఫిలిప్స్ పోర్టబుల్
3 బ్యాండులు 7 ట్రాన్సిస్టర్లు
రు. 405/-

B3CA091
ఫిలిప్స్ ట్రాన్సిస్టర్
3 బ్యాండులు 7 ట్రాన్సిస్టర్లు
రు. 339/-

(పన్నులు అదనము)

విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు అనుమతిపొందిన ఫిలిప్స్ రేడియో డీలర్లు:

తంతి "సౌండ్" } **ప్రజాగు రేడియో కో.,** { ఫోన్ 120

మెయిన్ రోడ్డు, విశాఖపట్నం-1

# భీరువు

దాకా, రెండుసార్లు శత్రువులు దాడిచేశారు తమ పోస్టుమీద రెండుసార్లూ దాదాపు ఇరవయ్యో, ముప్ఫయ్యేమంది వచ్చారు బహుశా పహారావాళ్ళు, అగ్రగామిదళంవారూ కావచ్చు— రెండుసార్లూ దెబ్బలు తినిపోయారు— ఈసారి— ఏమో.

"వలాంగ్‌నుంచి వార్త వస్తే బాగుణ్ను!" అనుకున్నాడు రాజా..

* * *

మధ్యాహ్నం ఒంటిగంట కావచ్చింది మబ్బుల మధ్యనుంచి సూర్యునివేడి హాయిగా తగుల్తూంది. నాయరూ, రాంసింగ్ ఏదో మాట్లాడుకుంటున్నారు హిందీలో రాజా ఆలోచనలంతా మరోచోట ఉన్నాయి

"పిరికి వాడివి నీవు"

కల్యాణి తనముందు నిలిచి అన్నట్టుంది. అవి మాటలుకావు— నిప్పులు—గుండెలు రగిల్చే చిచ్చులు.

కోపంగా, బాధగా ఆటోమాటిక్‌మీద తల వంచుకున్నాడు రాజ .

"భాయీ, దూరంగా ఏమిటది ?" అన్నాడు నాయర్

అందరూ ఉత్తరంగా పర్వతాలవైపు చూశారు దాదాపు అయిదారు మైళ్ళదాకా ఉన్నాయి కొండలు ఒకటి వెనుక ఒకటి తమకు ఎదురుగా కన్పించేవి మూడు దాదాపు నాలుగుమైళ్ళు ఉండవచ్చు దాని అవతల చిన్న నది—సెలయేరులాగా పోతూంది దానివెంబడి కదుల్తూంది— ఒక జనసమూహం రాంసింగ్ బైనాక్యులర్స్ తీసి చూశాడు, తర్వాత నాయర్, రాజా చూచారు

దాదాపు వందమంది కాబోలు ఉన్నారు నలుగురు కాబోలు ఆఫీసర్లులాగా పక్కన వస్తున్నారు వాళ్ళందరికీ చేతిలో రైఫిళ్ళు ఉన్నాయి

"నాయర్, ఇక్కడికేగా వాళ్ళు రావటం ?" అన్నాడు రాజా

"అవును మనం ఇక్కణ్ణించి పోవాలి" అన్నాడు నాయర్

"ఎక్కడికీ ? ఈలోగా వాళ్ళు రారూ ?" అన్నాడు రాంసింగ్

"వాళ్ళు వచ్చేసరికి మరో గంటన్నర పడుతుంది ఆ సెలయేరు దాటి, కొండచుట్టూ తిరగాలి ఈలోగా మనం వెనక్కు పోయి మన రెండో స్థావరం చేరుకోవచ్చు" అన్నాడు నాయర్

రెండో స్థావరం అక్కడి మరో మూడుమైళ్ళు వుంటుంది అది అక్కడికంటె నాలుగయిదు వందల అడుగుల ఎత్తైన కొండమీద వుంది పైనుంచి క్రింది లోయ, కొండలు పరిశీలించవచ్చు పైకి ఎక్కి వచ్చే శత్రువుల్ని సునాయాసంగా చెదరగొట్టవచ్చు స్థావరం వెనుకనుంచి కొండ ఏటవాలుగా అడవుల్లో కలుస్తుంది అక్కణ్ణుంచి మరో ఆరుమైళ్ళు దక్షిణంగా పోతే వలాంగ్ ! దాదాపు పదిగంటలు పడుతుంది, త్వరగా అడవుల్లోంచి పోగలిగితే—

"పదండి !" అన్నాడు నాయర్.

ఎవరి ఆటోమాటిక్ రైఫిలు వారు తీసుకున్నారు తాము అక్కడ వున్నట్లు ఏ గుర్తూ కన్పడకుండా పారేసిన సిగరెట్లు, (బెడ్‌చుట్టూ చుట్టిన కాగితాలు




కుటుంబం
అంతటికీ
ఉపకరించే
సముచితమైన
సబ్బు

# మార్గో సబ్బు



అతి నాజూకుగా, రమ్యమైన వాసనలీనే ఈ సబ్బు స్త్రీలకు, పిల్లలకు అతి మృదువుగా వుండే చర్మాన్ని పరిపోషించడంలో సాటిలేనిది. శుద్ధిచేసిన వేపనూనెతో తయారుచేసి, సుగంధ పరిమళాలతో మేళవించబడిన ఈ సబ్బు చర్మవ్యాధు లన్నింటిని నివారించి, శరీరానికి వన్నెలు తేవడంలో ప్రసిద్ధికెక్కినది.

**ది కలకత్తా కెమికల్ కంపెనీ లిమిటెడ్, కలకత్తా - 29**

దక్షిణ ఇండియా ఆఫీసు. 5/149, బ్రాడ్వే, మద్రాసు 1.



## జామ్-బక్

## పాదముల వాపు నొప్పిని శమనపర్చి నివారించును

కాళ్లవాపులు, వ్రణములు, కురుపులు, కాలినపుండ్లు విషగాయములు జామ్ బక్ గొప్ప చర్మ ఆయింట్మెంటుతో త్వరలో మానును. జామ్ బక్ చర్మంలోకి పోయి, గుణమిచ్చే ఔషధము దీనిలో జంతు క్రొవ్వులు నూనెలు లేవని గ్యారంటీ చేయబడినది.




ఇది మందుల వ్యాపారు లందరివద్దను దొరుకును.
పి ఇ ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి

సోల్ ఏజంట్లు దాదా & కంపెనీ,
65, నైనప్పనాయక వీధి, మద్రాసు-1.






## అందరును ఇష్టపడునవి కృష్ణా మిఠాయిలే

కృష్ణా మిఠాయిలు
సుఖాదార విధము ననుసరించి చేతితో తాకక చెఱకు రసమునుండి తయారుకాబడినవి.
బిడ్డలకు ఎక్కువ ఆనందము చేకూర్చునవి.

బిడ్డలు ఇష్టపడునవి
పెద్దలు పొగడునవి
కృష్ణా మిఠాయిలే.





**Krishna**
SWEETS

తయారుచేయువారు:
**ది కె. సి. పి. లిమిటెడ్**
38, మౌంట్ రోడ్, మద్రాసు-6

# శ్రీదేవి

9 వ పేజీ తరువాయి

జీవితం తప్పుదారి త క్కే స్థితికి వచ్చింది కాని, నీ పరిచయంతో అదంతా మారింది ఆ మార్పు పువ్వు కావాలని నాలో కలిగించింది కాదు నీలో ఉన్న మంచితనం, నాలో కలిగించిన మార్పు, అది అసలు విషయం మొదటినుంచీ చెప్తాను విను" అంది సావిత్రి

"అలా చెప్పు! అంతవరకూ నీ మాటలు నమ్మను" అంది శ్రీదేవి. బయట బాగా చీకటి వ్యాపించింది ఆరోజు కృష్ణపక్ష తదియ ముందు చీకటి వస్తుంది శ్రీదేవి గదిలో కూడా చీకటి వ్యాపించింది. సావిత్రి మాటలలో ఇద్దరూ లీనమయ్యారు. దూరంగా గోదావరి కూడా చీకటిలో కలిసికోపోయింది.

"నా చిన్నతనంనుంచి అంటే సుమారు ఎనిమిదో ఏటనుంచీ మా ఇంటిప్రక్కన ఉండే ముస్లిముల అబ్బాయితో స్నేహం ఉండేది. 'జలీల్' అతని పేరు. సన్నగా, ఎర్రగా ఉండేవాడు. అప్పటికి అతను పన్నెండేళ్లవాడు. చాలా సాత్వికంగా ఉండే వాడు. మా పెరడు చాలా విశాలమైనది. అందులో చాలా జామచెట్లు ఉన్నాయి. అతనూ, నేనూ జామచెట్లు ఎక్కేవాళ్లం. నేను మగపిల్లలకన్నా ఎక్కువగా అల్లరి చేసేదాన్నిట! జలీల్ నే నేపని చెయ్యమని చెప్తే ఆ పని చేసేవాడు. మేమూ, ఇంకా కొందరు అబ్బాయిలూ, అమ్మాయిలూ కలిసి అనేక ఆటలు ఆడుకునేవాళ్లం. అందులో నేను మహారాణిని! జలీల్ నాకు ముఖ్యమంత్రి! తక్కిన వాళ్లంతా మా సేవకులు. మా నాన్న గారు నామీదున్న ప్రేమకొద్దీ చాకెలెట్లూ, బిస్కట్లూ, పిప్పరమెంట్లూ విరివిగా కొనిచ్చేవారు. వాటి బలంతో నేను సులభంగా మహారాణిత్వం సంపాదించేశాను. జలీల్‌కి ఏవేవో ఆజ్ఞలు వేసే దాన్ని. అతను అవన్నీ విశ్వాసంతో నెరవేర్చి, నా దగ్గర చాకెలెట్ బహుమతు లందుకునేవాడు. ఇద్దరం ఒకరి నొకరం విడిచి ఉండేవాళ్లంకాదు. రోజూ ఇద్దరం విధిగా కలుసుకొని మాట్లాడు కుంటూ, సరదాగా గడిపేవాళ్లం. అలా రెండు మూడు సంవత్సరాలు గడిచాయి. మా ఇద్దరి మధ్యా ఎంతో సన్నిహితత్వ మేర్పడింది. నాకు పన్నెండోఏడు వచ్చిందాకా, ఇద్దరం చనువుగానే మెలిగేవాళ్లం. ఆ సంవత్సరం అతను స్కూలు ఫైనలు చదువుతూ ఉండేవాడు. నేను ఆ యేడే వ్యక్తురాలనయ్యాను. నన్ను మా ఇంట్లో ఆ సం॥ త్సరమంతా చాలా కట్టడి చేశారు. వెనుకటి లాగా స్వేచ్ఛగా తిరగనియ్యలేదు. జలీల్ కూడా పరీక్షల గొడవలలోనూ, నే నిప్పుడు పెద్దదా నయ్యాను గనుక నాతో తరుచూ మాట్లాడితే బావుండదని వాళ్లింట్లో వాళ్లు చెప్పడంవల్లా నన్ను ఎక్కువగా కలుసుకోలేదు. వాళ్ల పరీక్ష లవగానే వాళ్ల మేనమామగారి ఊరు విశాఖపట్నం పైలవరికి వెళ్ళిపోయాడు. ఆ మరుసటి సంవత్సరం నేను ఇంట్లో దెబ్బలాడి ఫోర్తుఫారంలో చేరాను. జలీల్ ఆ యేడు స్కూలు ఫైనల్ ప్యాసై, కాలేజీలో చేరాడు. శారీరకంగా ఇద్దరిలోనూ చాలా మార్పు వచ్చింది. మానసికంగా నాలో ఎక్కువ మార్పు వచ్చినట్లు లేదు గాని, జలీల్‌లో చాలా మార్పు వచ్చింది. కాలేజీలో జేరినప్పటినుంచీ అతనిలో

ఒక వింత —ఆకర్షణ ఏర్పడినట్లు నాకు తోచింది. పెద్ద కళ్ళూ, ఉంగరాల జుట్టూ, పెదవులమీద చిన్న చిరునవ్వూ, నా కతను చాలా అందంగా కన్పించసాగాడు. అతనిలో వెనుకటి అగూయిత్వం పోయి, చిలిపితనం, అల్లరితనం వచ్చాయి. నావైపు అతను చూసే చూపులు నాలో ఏదో అలజడి రేపాయి. మా యిద్దరిమధ్యా, వయసుతో కల్గే సహజాకర్షణ ప్రారంభమైంది. ఒకరి నొకరం తీవ్రంగా ప్రేమించుకుంటున్నామను కునేవాళ్ళం. పెద్దవాళ్ళు చూడకుండా, వాళ్ళకు తెలియకుండా మే మిద్దరం కలుసుకుంటూ మాట్లాడుకుంటూ ఉండేవాళ్ళం. నేను స్కూలుకి బయల్దేరిన సమయందాకా వేచిఉండి, నా వెనకాలే తనూ బయల్దేరేవాడు. ఇద్దరం పైవాళ్ళకు తెలియకుండా అదేన్యాపశంగా మాట్లాడుకునే వాళ్ళం. అతనిలో ఆవేశం ఎక్కువ. మే మిద్దరమూ ఏదైనా జరగాలి అనుకున్నప్పుడు నావల్ల ఏదైనా పొరపాటు వచ్చి, అది జరగకపోతే, నాతో రోజుల తరబడి మాట్లాడేవాడుకాదు. అలాంటప్పుడు నాకు పిచ్చెత్తినట్లుండేది. అతన్ని ఎంతో బతిమాలుకునేదాన్ని. ఆ రోజులలోనే ఇద్దరం విపరీతంగా ప్రేమ—లేఖలు రాసుకునేవాళ్ళం. అతని

## శ్రీదేవి

ప్రేమ—లేఖల్లో ఎంతో కవిత్వం ఉండేది. నేను అలా రాయలేకపోయేదాన్ని. అతను ఎంతో బాగా పాడేవాడు. హిందీ పాటలు అతను పాడుతూంటే ఎంతో హాయిగా, మాధుర్యము అనుభవించేదాన్ని. ఒకొక్కప్పుడు ఇద్దరం మా ఇంటి పరిస్థితులు అనుకూలిస్తే, మా పెరట్లో కలుసుకుంటూండేవాళ్ళం. వెన్నెల రాత్రుల్లో గడ్డిమేటు చాటున ఒకరి ఒడిలో ఒకరం వాలిపోయి, ఏవో పిచ్చి పిచ్చి ఆలోచనలూ, ఊహాగానాలూ, ప్రమాణాలూ చేసుకునే వారం. ఇద్దరం కలిసి పెళ్ళి చేసుకుని, ఆజన్మాంతం ఒకరి నొకరు విడవకూడదనిఅనుకున్నాం."

"నా మనసులో బాగా హత్తుకుపోయిన ఘట్టం గోదావరి లంకల్లో మేం గడిపిన రోజులు. అప్పుడప్పుడు మధ్యాహ్నం ఇద్దరం బడులు మానేసి, పడవ నొకదాన్ని అద్దెకు తీసుకుని, గోదావరిలో దూరంగా ఉన్న లంకల్లోకి పోయేవాళ్లం. వాటిలో మాకు కావల్సినంత ఏకాంతతా, ప్రశాంతతా, ప్రకృతి సౌందర్యం లభించేది. ఆ ఇసక దిబ్బల్లో కూచొని, అతను గొంతెత్తి పాడుతూంటే తియ్యని పుచ్చకాయల గుజ్జు తింటూ, ఎంతో ఆనందంగా వినేదాన్ని. పుచ్చకాయలూ, దోసకాయలూ, తెగ తినేవాళ్లం. చీకటిపడిపోతూంటే ఇంటికి అతి కష్టంమీద తిరిగి వచ్చేవాళ్ళం. నీటిమీద పడవ వెళ్తూంటే, ఎదురుగా అన్నీ చూస్తూ, జీవితం ఇంత ఆనందంగా ఉంటుందికదా; చాలమంది జీవితం దుఃఖమయం అంటారేమా? అనిపించేది. వాళ్ళు వట్టి తెలివితక్కువవాళ్ళు. వాళ్ళకే గనక నా చాకొలెట్లూ, మా పెరట్లో జామచెట్లూ, జలీలూ, అతని పాటలూ, అతని ప్రేమలేఖలూ, అతను నా కిచ్చిన ముద్దులూ, గోదావరి లంకల్లో పుచ్చకాయలూ—ఇవన్నీ దొరికితే అలా అనరేమో! ముఖ్యంగా జలీల్ పాడే పాట "తుమహా మేరీ, తుమహా మేరీ సాజన్, నిశిదిన ఫలచినా సాంజ సవేరే" అనే పాట వాళ్ళ జీవితంలో ఒక్కసారి వింటే చాలు; మరి మర్చిపోరు. "సాగర్ హై తుమ్, మై తరంగ్...... హృదయ హై తుమ మై ఉమంగ్........తుమీసే ఉషా, తుమీసే జ్యోతీ......తుమహీ న మేరా మన్ జానో సజన్......" అని పాడుతూ నా చెయ్యి పట్టుకొని, నా వేళ్ళు తన చెంపకానించుకొని, నా కళ్లలోకి చూస్తూపాడేవాడు మరుపురాని రోజులవి."

"జలీలూ, నేనూ పెళ్ళి చేసుకుందామని నిశ్చయించుకున్నాము. అతనికి చాలా ఆశయాలున్నాయి. అప్పటికి అతను ఇంటర్ సెకండియర్‌లోకి వచ్చాడు. తరువాత ఆనర్సు చదువుతానని, అది పూర్తైన తరువాత పెండ్లి చేసుకుంటానని చెప్పాడు. నాకు మా వాళ్ళను ఈ విషయంలో ఒప్పించగలనన ధైర్యం వుంది. ఇద్దరం వివాహం గురించీ, వివాహానంతర జీవితం గురించీ ఎన్నో ప్లానులు వేసుకున్నాం. కాని, ఒకనాటి ప్రొద్దున పిడుగులాటి వార్త విన్నాను. జలీల్ గోదావరిలో ఈదుతూ మునిగిపోయి చనిపోయాడు. ఆవాళ ప్రొద్దున్నే కొందరు కాలేజీ విద్యార్థులతో ఒక పడవలో రేవుదగ్గ నదిలోకి దిగి ఈత ప్రారంభించాడు. రేవుదగ్గ చాలా సుడులున్నాయి. కొద్దిసేపయిన తరువాత [illegible], తక్కిన వారందరూ వెళిపోయారు. అప్పుడు జలీల్ కేదో ప్రమాదం జరిగిందని గ్రహించారు. (సశేషం)

# కాఫీ బోర్డు ఫిల్టర్‌తో పూర్తి సువాసనగల కాఫీ






కేంద్ర ఆహార విషయక పరిశోధన సంస్థ రూపొందించిన నమూనా ప్రకారం తయారు చేయబడిన ఫిల్టర్. మీరు కాఫీని అతి తేలికగా తయారు చేసుకోడానికి వీలుగా—ప్రతిసారి అతిచక్కని కాఫీ అతి తక్కువ వ్యవధిలో మీరు తయారుచేసుకొన గలిగేటట్టు రూపొందించబడింది.

ఇదే జగ్ ఆకారంలో కింద వివరించబడిన రకాలు కలవు:—

| | | | |
|---|---|---|---|
| 4 కప్పులు పట్టేది— | ఇత్తడిది (నికెల్ పూత) | ... | ధర రు. 25.35 |
| | స్టెయిన్‌లెస్‌స్టీల్ | ... | ధర రు. 47.50 |
| 2 కప్పులు పట్టేది— | ఇత్తడిది (నికెల్ పూత) | ... | ధర రు. 20.50 |
| | స్టెయిన్‌లెస్‌స్టీల్ | ... | ధర రు. 31.50 |

స్థానిక పన్నులు అదనం

## ఫిల్టర్ నుపయోగించడం ఎలా?

కప్పుకు ఒక కొలతగిన్నె చొప్పున కాఫీపొడర్ వేయాలి.
(ఫిల్టర్‌తోపాటు ఈ కొలతగిన్నె కూడా ఇవ్వబడగలదు.)
ఇలా పోసిన కాఫీపొడిని సమతలంగా వచ్చేటట్టు సదాలి.



అప్పుడు బిళ్లను ఫిల్టర్‌లో పెట్టి బిళ్లతో కాఫీ పొడిని కిందకు తేలికగా నెట్టాలి.
తర్వాత మసలకాగుతున్న నీళ్లను బిళ్లపైన చుట్టూ పోయాలి.



అయిదు లేక ఏడు నిమిషాలలో కాఫీ తయారు అవుతుంది.
దానిలో పాలు, పంచదార రుచికి తగ్గట్టు కలుపండి.



ఇండియా అంతటాగల
ఇండియా కాఫీ డిపోలలోను
కాఫీ హౌస్‌లలోను
ఈ ఫిల్టర్ లభించును.




కాఫీబోర్డు, బెంగుళూరు.

# రాజధాని కబుర్లు

11—పేజీ తరువాయి

నృత్యాలు, నాటకాలు, ప్రదర్శనాలు ఇంకా ఏవో ఇలాంటి బాపతువి కావద్దా మరి! ఇవన్నీ చూస్తూ, ఒకాయన ఆశ్చర్యపోయి అన్నాడు. ఇదెక్కడ ఉప్పలాయయ్యా, హిమాలయాల్లో చల్లదనం ఎక్కువయిన కొద్దీ, మనవాళ్లకు వేడి పుట్టుకొస్తోంది అని. అదేమిటండీ అట్లా అంటారు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుంటూంటండీ అని సమాధాన చెప్పాను, ఇదీ నిజమే అంటూ తలఊపి వెళ్లాడు.

అయితే ఇంత హడావుడి, ఇంత హంగామా, ఈ రక్షణ నిధి వసూలుకు ఎందుకు కావలసివచ్చింది అని కాస్త నింపాదిగా ఆలోచిస్తే, మనకు దొరికే సమాధానాలు హృదయ విదారకంగానూ, నిరుత్సాహంగానూ కనుపిస్తాయి. ఈమధ్యనే నలుగురు కేంద్ర మంత్రులు ఇతర పనులమీద ఇచ్చటకు విచ్చేశారు. సరే, కాంగ్రెసు అధ్యక్షులు కూడా ఇక్కడ కాలు పెట్టి వెళ్ళారు. ఆయన ఉద్దేశ ప్రకారం, చైనాతో మనకు ఏదోవిధంగా 'సంధి' జరిగేటంత వరకు ఈ అత్యవసర పరిస్థితి ఉండితీరాల్సిందే అన్నారు. అయితే జగజీవన్‌రామ్‌గారు ఇంకో అభిప్రాయం వెలిబుచ్చారు: 'ఏ విధమైన ఒప్పందం చైనావాళ్లతో జరిగినప్పటికీ, మనం మన జాగ్రత్తలో ఉండాల్సిందే. వారు నమ్మకద్రోహులు'అన్నారు. సుశీలానయ్యర్‌గారు, 'మనం ఇప్పుడు నిద్రపోయే సమయం కాదు. శత్రువు పొంచికూర్చున్నాడు, జాగ్రత్త' అని హెచ్చరించారు. మన దేశంలో పంచదార కరువంటూ, లేదండోయ్ అంటూ యస్. కే. పాటిల్‌గారు వచ్చి మన నోళ్ళను తియ్యపడేశారు. ఢిల్లీనుంచి సరేసరి, పండిట్ నెహ్రూగారు ప్రజల్నందర్నీ హుషారుగా ఉండాలి; చైనాను నమ్మటానికి వీల్లేదని ఉద్బోధిస్తూనే ఉన్నారు.

హెచ్చరికోయ్, హెచ్చరికోయ్ అంటూ మధ్య మధ్య ఈ రభసేమిటి! కమ్యూనిస్టు చైనా వాళ్లను నమ్మిందెవరు! వాళ్ళు మనకేదో ఒరగ పెడతారని అనుకున్నదెవరు! వాళ్లే తుమ్మటం, వాళ్లే శతాయుస్సు అనుకోవటం! అమాంతం వచ్చిపడ్డ! కావలసినంత నష్టంచేసి, వెనక్కు వెళుతున్నామని, నాలుగడుగులు వెనక్కు తగ్గ! ఇదే బలే మంచి సమయమనుకుని, మనవాళ్లు అక్కడకు చేరి ధ్వజమెత్తుతున్నారు. ఈ దాగుడుమూతల వ్యవహారం పనికిరాదు. కమ్యూనిస్టు చైనా మన భూభాగంనుంచి పూర్తిగా వెళ్ళిపోయే దాక, వాళ్ల మొహం చూడకూడదు. వాళ్ళు పరమ శత్రువులు, కిరాతకులు అంటూ పార్లమెంటు ముక్తకంఠంతో భారతవాణిగా పలకటమయిపోయింది. సిరిసిరి మువ్వా అన్నట్టు, సిరిమావో నాలుగు కాగితాలు పట్టుకు రాగానే, సంప్రదింపులంటూ మన వాళ్లు చప్పబడుతుంటె! యుద్ధ విరమణ అయింది. ఓ మూల రాజీకోసం కొన్ని దేశాలు ప్రయత్నం చేస్తున్నాయి. ఇంకేమీ ప్రమాదం రాదులే అనే భావం కొద్దో గొప్పో ప్రతివాని మనస్సులోనూ కలిగిందనే మాట అంగీకరించితీరాలి. ఇది చాలా ప్రమాదమైన విషయం. కమ్యూనిస్టుచైనా మోసం సామాన్య ప్రజలు అర్థం చేసుకోవటంలేదు. ఈ కారణంవలనే రక్షణనిధి వసూళ్లకు పెద్ద జాతర

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

విధంగా పనులు కొనసాగించేందుకు ప్రస్తుతమున్న ఈ అసాధారణ పరిస్థితిలో వీలౌతుందా ? దేశరక్షణకుగాను మన ప్రణాళికను ఎందుకు కుదించుకో కూడదు ?—ఇలాంటి ప్రశ్నలన్నీ, దేశ రక్షణావసర వస్తువు లేమిటో, అవి ఎలా సమకూర్చుకోవాల్సి యుంపై తప్పుడు అభిప్రాయంవల్ల ఏర్పడేవి. ఈ అసాధారణ పరిస్థితి ఏ కొద్ది కాలానికో అంటే ఏ కొన్ని నెలలవరకో అయితే, మిగతా వ్యయాలను చాలా తీసిపారేస్తూ, అభివృద్ధి పథకాలని కొంత కాలంపాటు, ఈ ధనాన్ని దేశరక్షణకు వినియోగించేందుకని ఆపివేద్దాం. కానీ, ఈ అసాధారణ పరిస్థితి చాలా కాలంపాటు ఉండబోతోంది. ఈ కాలములో రక్షణకు కావలసిన సామగ్రి పుష్కలంగా సంపాదించి, రక్షణను విస్తృతం చేయాలి. ఇది జరగాలి అంటే దీనికి తోడు ఆర్థికంగా కూడా అభివృద్ధి జరగాలి. ఈ రెండు విషయాలను దృష్టిలో ఉంచుకొనే మనం అభిప్రాయాలు ఏర్పరచుకోవాలి. ఇకముందునుంచి రక్షణ, అభివృద్ధలను జాతీయ ఆర్థిక పథకాల్లో ముఖ్యాంశాలుగా, తదంతర్భాగాలుగా పరిగణించాలి.” ఈ వాదన చూస్తే బడిపిల్లలు కూడా పగలబడి నవ్వుతారు. “దేశ రక్షణ నిర్మాణంతోపాటుగా, తదితర అభివృద్ధి కూడా నిర్వహించగలమా” అనేది అసలు అడిగిన ప్రశ్న. అయితే “ఇకనుంచి రక్షణ, అభివృద్ధులను జాతీయ ఆర్థిక ప్రణాళికలలో ముఖ్యాంశాలుగా, తద్భాగాలుగా పరిగణించాలి.” అని శ్రీ నందాజీ సమాధానం. ధన మెక్కణ్ణుంచి వస్తుందనే విషయంలో లాలాజీకి ఏ బెంగా లేదు!

ఆదాయాలు పెంపు చేయటంతో సంబంధం లేని వ్యయ శాఖకు ఆయన మంత్రి మరి. ప్రణాళికా సంఘం 1963—64 పథకానికీ, రక్షణ శాఖకు కలిపి భారతదేశానికి రు. 4000 కోట్లు ఖర్చవుతుందంటే, ఈ భారత్, సాధూ సమాజ్‌ల అభిమాని చాలా తక్కువనుకుంటున్నట్లున్నారు. రాబోయే పన్నులతో దేశంలో ప్రతివారిని బాధపెట్టాలనేది కాంగ్రెస్ సిద్ధాంతం. మంత్రుల కేమాత్రం ముప్పు రానంత వరకు ఈ ఆదర్శం సినదైందే! ఇంకో ఉదాహరణ : వర్క్సు శాఖ మంత్రి శ్రీ మెహర్‌చంద్ ఖన్నా, మంత్రులు వాడే నీరు, విద్యుత్తు వినియోగం బిల్లులపై పరిమితి విధించమని కోరారు. మంత్రులకు సుమారు నెలకు రు. 1000 పైన ఈ బిల్లు అవుతుంది

ఆర్థికమంత్రి సలహాప్రకారం ఒక్కొక్క మంత్రి వాడే నీరు, విద్యుత్తు గరిష్ఠ వినియోగం నెలకు రు. 250 కు మించకుండా నిర్ణయించటం జరిగింది. దీనికి ఐక్యకంఠంతో, మూకుమ్మడి నిరసనలు రావటం, ఈ ప్రతిపాదనను గట్టు వాయించటం జరిగింది. దేశంలో అసాధారణ పరిస్థితిలో, మహాత్మాగాంధీ శతాబ్దేనరులు చేస్తున్న త్యాగబలం ఇలా









ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# రాబోయే ఆకర్షణలు!

"మరువలేని మనిషి"

రచన

సాధనా శివదాసాని

వచ్చేవారమే!

"నివురు గప్పిన నిప్పు"

రచన

వాసంతి

బొంబాయి ఆంధ్ర మహాసభ పోటీ కథ

పై వారం!




సర్వ గర్భాశయ వ్యాధులను పోగొట్టి, ఆరోగ్యమును సంతాన మును కలుగజేయును. అన్నిచోట్ల దొరకును. సీసా 2-8-0

కృష్ణా ఫార్మసీ బెజవాడ

---

## RATNAM'S N-OIL

(పై పూతకు మాత్రమే)

అంగ నరములు బలహీనత చెంది, చిన్నదైనచో తిరిగి యథాప్రకారం అయి పూర్తి సౌఖ్యమనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10/–లు. పో. 1-4-0. కావలసినవారు ముందుగా 1 4-0 పంపేవి. ఇంటులో స్పెషల్ రకం అర్జంటు గుణమునకు రూ. 25-0-0 లు.

డాక్టర్ రత్నం సన్స్. (Estd 1904)

మలకపేట బిల్డింగ్స్, ఆజంపూరా మార్కెట్ వద్ద, హైదరాబాద్ 24 (ఆంధ్రప్రదేశ్)

---

## జైకో ఫినైల్, జైకో ఇంక్స్

ఒక దఫా వాడిన తృప్తి కల్గును. పెద్ద వర్తకుల వద్ద లేక ఆర్. కె. వి జెన్నీన్, విశాఖపట్నం-1 వారి వద్ద దొరుకును

తయారు చేయువారు:

జైకో ఇండస్ట్రీస్ & ట్రేడర్స్.

19, గోవిందప్ప నాయకన్ వీధి,

మద్రాసు-1.

---

## పొడుగు పెరగండి



సరిక్రొత్త దేహపరిశ్రమలు ఆహార నియమములు పాటించి, పొడుగు పెరిగి, ఆరోగ్యవంతులుగా ఉండండి. వివరములు ఉచితముగా పంపబడును

Total Health for All

283. Azad Market (A. P. M.)

Delhi.

---

## పాకెట్ హీటర్



కొన్ని సెకండ్లలో వేడినీరు. క్షౌరము, స్నానంచేయుటకు, టీ, కాఫీ తయారు చేయుటకు, ఉపయోగించును. ప్రతి ఇంటికిఆవశ్యకము.డాక్టర్లకు,విద్యార్థులకు, సెలూన్స్వంతదార్లకు, ప్రయాణికులకు ఉపయోగకరమైనది. ధర రు.6-50పోస్టేజి రు.1-25అదనం. 3 హీటర్లు కొనిన పోస్టేజి ఉచితం.

FOREIGN TRADERS

Gol Bagh (E 9) Amritsar

---

## డాక్టర్ వృత్తి చేయండి



విరామకాలంలో ఇంటిలో పోస్టు ద్వారా హోమియోపతి చదివి, గవర్నమెంటు రిజిస్టరు చేయించుకుని ప్రాక్టీసు చేయండి. ప్రాస్పెక్టస్ ఉచితం. వెంటనే వ్రాయుడు

Indian Homoeopathic College

(APW), JULLUNDUR CITY

---

# తరచుగా మూత్రవిసర్జన

చక్కెరతోగాని, చక్కెర లేకుండగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైన వివ్వాము. శరీరాన్ని గుల్ల చేయడమే కాకుండా ఈ వ్యాధి, తన బంధంలో చిక్కినవారిని ఆరోగ్యాకాంక్షా మృత్యువుకు ఆహ్వానం చేయును. ప్రథమ దశలో శారీరక, మానసిక శ్రమలకు ఉపక్రమించకుండుట, నడుములో నొప్పి, చూపుమాంద్యము, తొడల తిమ్మిరి, నరముల బలహీనతతో ఈ వ్యాధి పొడచూపును. పై లక్షణములతో కూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు పొడి యెండుట, దురదలు, కాళ్ళలో పగుళ్ళు, తూకం తగ్గడం, శరీరమంతా పొట్లు, కీళ్ళ నొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండు, ఇట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యేర్పడి సంభవించవచ్చును.

"వీనస్ ఛారమ్" మాత్రలు వాడి అనేక వేల మంది తమ బాధలనుండి నివారణపొంది మృత్యు కరాళమునుండి రక్షింపబడిరి. "వీనస్ ఛారమ్" శాస్త్రీయ పద్ధతులమీద ప్రాచీన యునానీ వైద్య విధానం ప్రకారం అమూల్య ఔషధుల శోకనదార్థ ముల, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. అమిత దాహము, మూత్రంలో చక్కెర తగి పలుమార్లు మూత్ర విసర్జనచేయు అవసరము 2 లేక 3 రోజులలోనే మీకు చాలా భాగము నివారణ యగును. కొద్దిరోజులలోనే మీకు నిగానికొన్నగా ప్పన త వేళూరినట్లు విపించును. "వీనస్ ఛారమ్" కొద్ది వ్యయముతో సుఖముగా, తేలికగా సేవించ వచ్చును. దీనికి ప్రత్యేక పథ్యములేదు. విరాహార ముతోనుండే అవసరంలేదు. రోగులు పుష్టి కలిగిన ఆహారము తినేందుకై ఉపవాసకట్టేకి కి ఎన్ని సరకాల ఆహార పదార్థముల తినికొనవచ్చును. వివరముల గల ఇంగ్లీషు కరపత్రాలు అడిగినవారికి ఉచితముగా పంపబడును. 50 బిళ్ళల ఖరీదు రు. 8-75 న.పై మాత్రమే. ప్యాకింగ్ మరియు పోస్టేజి ఉచితం.

(SELLING AGENTS)

Barrys Commercial Corporation

(W A. P.)

27/A, Dhurumtollah Street

CALCUTTA-13.

Edited. Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street